

B. THAMMI REDDY GARU,

*Land Lord,*

*President, Taluk Board,*

ADONI.

# పండితాభిప్రాయములు.



తిరుపతివాస్తవ్యులును, బహుగ్రంథప్రణేతులును, న్యాయవాదనోద్యోగ విశ్రాంతులునగు బ్ర॥ శ్రీ॥ నాగపూడి కుప్పుస్వామయ్య బి. యే. గారిట్లు వ్రాసియున్నారు.

అయ్యా! చిత్రము! మహాపతివ్రతయగు ననసూయా మహాదేవి చరిత్రమును మార్కండేయ పురాణస్థమగు దానిని నేను జదువుచుండి ముగించిననాఁడే తామంపిన "అనసూయామహిమ" యను నాటకము నాకుఁ జేరినది దానిని సమగ్రముగాఁ జదివి కరంబు సంతసించితి. మీపాత్రముల నాటక సంవిధానము చమత్కారముగా సంఘటింపఁబడియున్నది. శైలి సరళమును మనోజ్ఞమును నిర్దుష్టమునై యలరారెడు. చదువుటకెంతయు సొంపుగానున్నది ప్రదర్శనంబునం గరంబు మనోహరంబుగా నుండుననుటకు సందియంబు లేదు. పతివ్రతాశిరోమణి చరిత్రముగావున నారీజనంబుల మనంబుల కుత్తమ పతీత్వము నెలకొల్పునదియై యునికిం జేసి సర్వజనాదరణీయంబై వెలయునని తలఁతు.

విజయనగరము మహారాజాకాలేజిలో ప్రధానాంధ్రపండితులగు బ్ర॥ శ్రీ॥ ఆకుండి వెంకటశాస్త్రులు వారిట్లు వ్రాసియున్నారు.

ఉ॥ నాయెడఁ గల్గుగౌరవమునన్ దమరంపినచిన్నిపొత్తమే ।
నాయతమోదయుక్తముగ నందుకచూచిపఠించితందు బా ।
లాయువతీజనమ్ములు కలంకము లేక చరింపఁద్రోవలన్ ।
జేయఁగరానికార్యములుఁ జేర్చితివౌఁగద, సుబ్బరాట్కవీ ॥

క॥ నిస్తులపతివ్రతాచరి । తస్తుతియును, నెట్టుసతులుధరణినసూయా ।
గ్రస్తలుఁగారామియమీ । పుస్తకపుంబేరె తెల్లముఁగ దెల్పెఁగదా ॥

క॥ మీయుద్యమము ఘనం । బైయొప్పెడుననుచు నెవరికైనను బలుకన్ ।
న్యాయమ్ముగాదె సుబ్బా । రాయకవీ । యనఘగిరిపరణబుద్ధిపవీ ॥

తామ ముద్రింపించుటలో గొన్ని పొరపాటులు పడినవి. వానిలో గొన్నిటి నిందుఁ జూపుచున్నాను. తమరు నాచూపినవానినట్టు తక్కినవానిని ద్వితీయ ముద్రణమునఁ దొలఁగించుకొనునది. ఇట్టు నా చనవుమాటల మన్నించునది :—

దగలి, బిలచి, చెప్పగలను, పగూడదు, కాబట్టి, జ్ఞాపము, కరదాళ, గీతారసంబు, నిష్క్రమణ, ద్రాపెదను, వచ్చుటవలకు, మామడి, పుత్రు॥ పుత్రులందో, లేనిచో గణభంగము, ఇదేగ్రంథకర్త, ఇట్టివి పెక్కులు తాముచూచుకొనవలెను క్షమింపుఁడు.

పర్లాకిమిడి వాసులు, ససమాన సంస్కృతాంధ్రభాషా పాండితీ విలాసులు, రావుసాహేబ్బిరుద విభాసులునగు గిడుగు వేంకటరామ మూర్తి పంతులు బి. యే. యల్. టి. గారు వ్రాసిన విపులచర్చ యందలి సంగ్రహము:—

ప్రకృతకాలమున గ్రంథముల సర్వలక్షణ సమేతములుగాఁ బూర్వకవులుం బోలె నెవ్వరును వ్రాయఁజాలరనియుఁ, దమతమ మాండలీయక శబ్దములను నన్య భాషా పదములను స్వేచ్ఛగాఁ దమకావ్యములఁ జొన్పుచున్నారనియు, నీపద్ధతి మానజాలరనియుఁ, గొన్ని వ్యాకరణాంశములను సహితము పాటింపరనియు, నిజ దేశ వ్యావహారిక పదముల నుపయోగించినయెడల నట్టివి యన్యదేశస్థుల కేని, పండి తులకేని యర్థముకావనియు, లేక విపరీతార్థముల నిచ్చుననియు, నిన్నిచిక్కులఁబడి గ్రాంథిక భాషలో గ్రంథములను వ్రాయఁబూనుటకంటె సర్వజన సుపరిచితమైన వ్యవహారభాషలోనే వ్రాయుటయుత్తమమని బోధించుచుఁ దమయభిప్రాయము నిట్లిచ్చియున్నారు:—

„ నాటకరచన మెచ్చుకోదగినది. కథ కల్పించడములోను, పాత్రలను నిరూపించడములోను, పాత్రోచితముగా భావములను వ్యక్తపరచడములోను, సందర్భశుద్ధిగా అంకములు విభజించడములోను చాలా నేర్పుకనబడుతున్నది. పాత్రకాలసంగము నాబుద్ధికి యుక్తముగా కనబడలేదు.

కృష్ణాజిల్లా చిట్టిగూడూరు నారసింహ సంస్కృత కళాశాలా ప్రధానపండితోత్తములగు విద్వాన్ దువ్వూరు వేంకటరమణశాస్త్రులు గారిట్లు వ్రాసియున్నారు:—

“తా మంపిన యనసూయామహిమ చేరినది. అందు. మీర లావశ్యకమని తలంచిన ‘పాఠశాల’ రంగము మిక్కిలి యావశ్యకమయినదియు, నదియే ప్రకృత నాటకోదయమునకు ఫలపర్యవసాయియగు ముఖ్యబీజమనియుఁ దోఁచుచున్నది. నిరంజనాది శిష్యప్రవేశప్రయోజనము నాచార్యకోటిలోని నారదుని వలన నేవ్యక్తీకరించుట యెంతయు నుచితము. కాళిదాసాదులపక్కని స్మరింపఁజేయుచున్నది. అంబిక వివేచనాపటిమయు, ననసూయ యనసూయారాహిత్యమునకు సానవెట్టుచున్నది. పతిభక్తి, యతిథిసేవ వినయశీలము మున్నగు నీతిదాయకములగు ననసూయ సద్గుణములు లలితోదారములు. తమకవితాలహరిలో రసపిపాసువులకు హృదయపేయములుగాక మానవని నానమ్మకము.”

ఆంధ్రబ్రహ్మాండ పురాణాద్యనేక గ్రంథకర్తలును, కడప హైస్కూలు ప్రధానాంధ్ర పండితులు నగు కావ్యతీర్థ జనమంచి శేషాద్రి శర్మగారిట్లు వ్రాసియున్నారు:—

“మీరు కరుణమై ననిపిన “అనసూయామహిమ” అను నాటకమును సమగ్రముగాఁ దిలకించితిని. పతివ్రతల సుచితములగు పద్ధతులిందుఁ దెలుపఁబడినవి. స్త్రీలకలవడఁదగు సదాచారము లీనాటకమును దిలకించిన నలవడకమానవు. దీనిని నాటకమనుటకన్న నాటికయన్న మేలనియెంతు. ఏలన నిందు మూఁడంకములే యున్నవి. లక్షణముల నీకాలపువారు పాటించుటలేదని నే నెఱుంగుదు. ఐన నిట్లు వ్రాయవలసివచ్చినది. పద్యములు నీతిబోధకములు. శైలి మనోహరము. భావములు సులభగ్రాహ్యములు. ప్రథమాంకమున ద్వితీయరంగమున నొక సీసపద్యమున “తాళ్లకమ్మలేల” అని కనుపట్టెడిని. ఈపదము రసపుష్టిని గూర్పజాలదు. రత్నములకు తాళ్లనుట పాడిగాదని నాభావము. ఈకాలపు ప్రదర్శనమునకు దగినట్లు పద్యములు కొలఁదిగనేయున్నవి. అనసూయామహిమ వినఁదగినది. శక్తిగల్గినఁ జూడఁదగినది కావున నీనాటకము సర్వవిధముల స్త్రీలను గుణవతులనుగాఁ జేయు నుపయోగించుననుట నిస్సంశయము. అనసూయామహిమ యనుటకన్న చరిత్రమనిన బాగుండునేమోయనితలంతు. ప్రస్తావన మిగుల బాగున్నది. ఈనాటకము మీ కనంత శ్రేయస్సును గూర్చుఁగాక. దత్తమండల నాటక విఖ్యాతిని స్థిరము చేయఁ బూనిన మీ ప్రయత్నము సఫలమగుంగాక.”

ఆదవాని మునిసిపల్. హైస్కూలునందుపాధ్యాయులును గ్రంథవిమర్శనచణులునగు బ్ర॥ శ్రీ॥ బి. వెంకటశాస్త్రి బి. యే. యల్. టి. గారిట్లు వ్రాసియున్నారు.

" అనసూయామహిమ " యనునీ చిన్ననాటకము బాలబాలికల కనుకూలముగ వ్రాయఁబడినది. ఇది శాంతరసప్రధానము. ఇందు పాతివ్రత్యమహిమ చక్కఁగా వర్ణింపబడినది. కథానాయికయగు ననసూయపాత్రము బాగరూకతతో పోషింపబడినది. ఆమె శాంతము, పతిభక్తి, అతిథిపూజా ధురంధరత్వము, తపోమహిమ చూపఱను భక్తిపరవశులఁజేయును.

నారదపాత్ర మీనాటకమున వెన్నెముకవంటిది. ఈపాత్రమువలననే కథావస్తువు పెంపొందింపబడినది. త్రిమూర్తులరాణులకు మత్సరము పెంపుజేసి వారికి గర్వభంగమగునట్లు చేసినదీతండు. ఈతనికార్యదీక్షయు చతుర్యృతియు ప్రశంసనీయము. పాతకాలరంగమున వర్ణింపఁబడిన పాతివ్రత్య లక్షణములు మిగుల నుపయుక్తములైనవి. ఇందలి పద్యములుగూడ మిగుల హృదయంగమములుగనున్నవి. అందు " ఇల్లిల్లు పనిలేక..." యను సీసపద్యము మణిపూసవంటిది. ఆయాయితావుల హాస్యరసముకూడ పోషింపబడినది. కొన్నిచోట్ల నారదునిమాటలును, చేష్టలును నవ్వుబుట్టించును. గరుత్మంతుని తొందరపాటును, త్రిశక్తుల యాత్రయును నవ్వుగొలుపునట్లు చిత్రింపబడినవి.

శైలి మిగుల లలితమైనది. పద్యములును గద్యములును స్వభావయుక్తముగ నున్నవి.

రెండు మూడు చోటుల ననౌచిత్యము కానవగును. పాతకాల రంగమున వనలత " పెనిమిటిని గన్నవారు రాక్షసులా " అని ప్రశ్నించుట యంతసమంజసముగా గన్పట్టదు. రంగమున నావునుబిండుటయు ప్రదర్శనార్హము కాదనితోచెడి.

నాటకమునకు " అనసూయామహిమ " అనుటకంటె " దత్తాత్రేయజననము " అను నామము యుక్తియుక్తముగా నుండునేమో.

మొత్తముపైని నాటకము హృదయరంజకమై ప్రదర్శనార్హముగనున్నది.

**"THE HINDU" dated 4th May 1927, writes as follows:—**

"This is a Telugu Drama published under the patronage of MR. B. THAMMI REDDY, Land-Lord and President, Taluk Board, Adoni. The ideal of a Hindu wife is devotion, whether he is rich or poor, beautiful or ugly. Hindu Mythology abounds in stories where women have performed miracles by virtue of their chastity. The story of "ANASUYA" is one such and the another has adopted this story as the plot of the play with deviations here and there. The scene in which girls are taught by Anusuya in a school, the virtue and necessity of chastity is the product of the author's imagination. The plot is well developed and the several charactors are well depicted. By dint of pure and simple life Anusuya had acquired a magnatic influence which could be exercised over even lions and tigers and by her chastity she could melt even iron and had thus surpassed even goddesses in her power. . The drama places high and inspiring ideals before young girls and as such it should prove useful to them."

నిడదవోలు పురవాస్తవ్యులు ననేకసరస గ్రంథరచనాదక్షులునగు బ్ర॥ శ్రీ॥ మంగిపూడి వెంకటశర్మగారిట్లు వ్రాసియున్నారు.

తమరు దయతో పంపిన అనసూయామహిమయను నాటకము సాదరముగా సాంతముగాచదివి యానందించితిని. కథాకల్పనము, పాత్రపోషణము, భాషాసౌష్ఠవమును, పదయమకము, భావగౌరవము చక్కగానున్నది. ఇందు మృదుమధురమైన హాస్యరసము సందర్భానుకూలముగ పొందింపబడుటచే హృదయరం

జకముగాను ప్రౌఢముగాను నున్నది. బాలికలనుద్దేశింపబడిన యీనాటకశైలి యించుక సులభముగానున్న తమసంకల్పమునకు సరిపడియుండెడిదని నాయాశయము. బాలికలకని తాము వ్రాయుటచే నీమాట వ్రాయవలసివచ్చినదిగాని నాటకము చదివినవారికిందేలోటులును లేకుండ నుత్తమగ్రంథముగా నొప్పుచున్నది.

ఈనాటకము నేను శ్రీ బులుసు సాంబమూర్తిగారితో కలిసి చదువుట తటస్థించినది. వారును సర్వవిధముల నాయభిప్రాయములతో నేకీభవించిరి. తామింకను ననేకగ్రంథరత్నములను రచియించి భాషాసౌభాగ్యమును పెంపొందించెదరని కోరుచున్నాను.

ఆదవానీ పురస్థితులును జ్యోతిశ్శాస్త్ర పారంగతులు నగు బ్ర॥ శ్రీ॥ జొహరాపురము శేషాచార్యులువారువ్రాసిన విపులాభిప్రాయసంగ్రహము:—

బాలికలకేగాక యువతులకును మీగ్రంథము నీతిదాయకముగానున్నది. పలుకులు ముద్దులొలుకుచున్నవి. 'పద్యేపద్యేరసోదయం' అన్నట్లు కథ చదువుకొలది రసపుష్టి కలిగియున్నది. ఈకథలో వర్ణింపబడిన ముగురమ్మగారు, ముగురయ్యగారు మీకనంత శ్రేయస్సు నిచ్చెదరుగాక.

శ్రీమదాంధ్రసాహిత్య పరిషత్పత్రికాధిపతులిట్లు వ్రాసియున్నారు.

అనసూయామహిమ — ఈగ్రంథమాదవాని పురవాస్తవ్యులగు గార్లదిన్నె సుబ్బరాయ ప్రణీతమగు చిన్ననాటకము. బాలికలకు నీతిదాయకముగా నుండునటుల మహాపతివ్రతయు నత్రిమహాముని భార్యయునైన యనసూయ చరిత్రమును త్రిమూర్తులామెను బరీక్షించి బాలకులగుటయు, దత్తాత్రేయజననమును మొదలగు బురాణవిషయములిందు సరసముగాను హృద్యముగాను వర్ణింపబడినవి. గ్రంథకర్త దత్తమండలవాసియగుటచే దత్తమండల ప్రయోగములు కొన్ని గానవచ్చుచున్నవి. జనసామాన్యమగు కథలనువిడచి, యనసూయా చరిత్రమును నాటకముగ రచించిన గ్రంథకర్త యుద్యమ మెంతయు బ్రశంసనీయము.

జగద్గురు శృంగగిరి కూడలిసంస్థాన పండితులగు వే॥ బ్ర॥ శ్రీ॥ పాలపూడి నరసింహశాస్త్రులువారిట్లు వ్రాసియున్నారు.

మహాశయా !

" అనసూయామహిమ " యను నాటకమ్మును దిలకించితిని. ఇయ్యది బాలు రకుంగూడ సుబోధమై, నాతికఠినశైలి కలదై, వెలయుచు ప్రతిగేహినియు జదువ దగినదిగానున్నది.

మ॥ అనుమానంబిసుమంతలేదు, గుణశయ్యారీతిలాలిత్యముల్ ।
కనులంగట్టినయట్టులుండుటకు, సత్కావ్యంబులందెల్లనీ ।
యనసూయాచరితంబునాటకముగానత్యంతసచ్ఛైలిచే ।
ఘనమైనట్లురచించినాడవుగదా ! గా॥ సుబ్బరాయా ! కవీ॥

శ్రీమతి, విద్వాన్, కవితిలక, కంచనపల్లె కనకమ్మగారిట్లు వ్రాసి యున్నారు.

క॥ అనసూయయగుట దనయెద ।
లనసూయల్ జూపుదేవలలనలనైనన్ ।
దనసామర్థ్యంబున వం ।
చినరీతినునీతి గఱపుస్త్రీ, జనములకున్ ॥

క॥ అత్రితపోవిధి, తత్సతి ।
పాతివ్రత్యంపుమహిమపలికెన్ భక్తిన్ ।
స్త్రీతిలకబోధకుందగు ।
రీతిన్, గా॥ సుబ్బరాయకృతిసంప్రీతిన్ ॥

క॥ దత్తాత్రేయజననమీ ।
పాత్రమునందెల్పబడుట । బుణ్యులువిని లో ।
కోత్తరసద్గతి గనుటకు ।
నుత్తమమైయొప్పు సుకవియుద్యమమిందున్ ॥

ఆదవాని మునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్రపండితులగు విద్వాన్, కావ్యభూషణ, ఆంధ్రవిద్యా వాచస్పతి తోగర్చేటి భాస్కరసిద్ధాంతులు వారిట్లు వ్రాసియున్నారు.

శ్లో॥ శ్రీగార్గ్యబ్దివంశ । ప్రోద్యన్ముక్తాఫలాయితస్యకవేః ।
శ్రీసుబ్బరాయనామ్నో । హ్యానసూయామహిమనాటకంజీయాత్ ॥

శ్లో॥ అనసూయామహిమాభిధ । నాటకరత్నంవ్యలోకయంసర్వం ।
యద్గృహిణీతివిశేషం । తద్రమణీనామవశ్యపఠనార్హం ॥

తమనాటక మన్నివిధముల ఖండితప్రశంసనీయమైయున్నదని విన్నవించుట, యెంతమాత్ర మతిశయోక్తి కానేరదని నొక్కివక్కాణింతు.

# తప్పొప్పులపట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ముఖపత్రిం | 8 | ముద్రిణ | ముద్రిణము |
| లోపలిపుట | 7 | ముద్రిణ | ముద్రిణము |
| ఉపోద్ఘాతము (1) | 10 | మహాత్మ్యము | మాహాత్మ్యము |
| 4 | 15 | నీపు | నీవు |
| 5 | 20 | సత్యావార | సత్యాసార |
| 5 | 21 | ఇత | ఇంత |
| 6 | కడపటి | సనం॥ | నిరం॥ |
| 7 | 3 | నక్కర | నక్కఱ |
| 7 | 7 | సనం॥ | వారం॥ |
| 7 | 13 | వెట | వెంట |
| 10 | 10 | మనోహరకా | మనోహారకా |
| 12 | 3 | అ. | అం. |
| 12 | 19 | వతి | పతి |
| 13 | 2 | వెట | వెంట |
| 14 | 8 | రూచింతును | రూజింతును |
| 14 | 10 | పరచెదను | పఱచెదను |
| 16 | 4 | రెుసంగి | రుుసంగి |
| 16 | 17 | గావిచితివి | గావించితివి |
| 17 | 4 | వాకని | లాకని |
| 18 | 7 | ప్రేరూప | ప్రేమరూప |
| 18 | 15 | ఘాగ | ధార |
| 19 | 6 | దవు | దగవు |
| 20 | 22 | దోశాడు | దోకాడు |
| 21 | 7 | మాడో | ముతో |
| 24 | 19 | కొక | కొక్క |

| | | | |
|---|---|---|---|
| 26 | 5 | కొరినను | కోరినను |
| 27 | 6 | బలుకరే | బలుకుదురే |
| 27 | 14 | కొంచము | కొంచెము |
| 28 | 17 | కేమిడి | లేమిడి |
| 28 | 19 | గనిపడతి | గనినపడతి |
| 29 | 5 | మార్చినట్లు | మాటినట్లు |
| 29 | 19 | ఎమ నగా | ఏమన గా |
| 31 | 13 | సాక్షాదై | సాక్షాద్దై |
| 32 | 20 | ణ్యావంతుడుగా | ణ్యావంతుడుగా మంచు మనలుబుద్ధుడు సధర్మవంతుడు నిర్దాక్షి |
| 35 | 18 | పీల్చిలైవ | పీల్చివైప |
| 35 | 6 | చాలు | జాలు |
| 38 | 6 | మాన్యమ్మ | మ్రాన్యమమ్మ |
| 38 | 10 | నగులే | నగునె |
| 38 | 20 | మీ రెక్కగాని | మీ రెక్కవగాని |
| 40 | 4 | జాటినట్లు | జాతినట్లు |
| 40 | 10 | యోచింతును | యోజింతును |
| 42 | 6 | వచ్చినాను | వచ్చినాను దేవలోకమంతయు తిరిగితిని. ఎవరును జేరగాదనిరి. |
| 42 | కడపటి. | దము. | దకము. |
| 43 | 4 | పై | స్వై |
| 43 | 22 | విజ్ఞాపములు | విజ్ఞాపనముల |
| 47 | 6 | యొండజ | యండజ |
| 47 | 17 | యోచించి | యోజించి |
| 47 | 22 | వైచెదకా | వైచెదనా |
| 49 | 23 | పొందిన | పొందినది |
| 50 | 9 | యోచించెద | యోజించెద |
| 50 | 20 | త్రిశక్తుల | త్రిశకస్తుల |

| | | | |
|---|---|---|---|
| 50 | 20 | యొక్క వమని | యొక్క వయని |
| 51 | 17 | పమేతగా | పమేతముగా |
| 52 | 20 | వా మమాధా | వా సమాధా |
| 53 | 14 | వృత్తెంచుము | బుత్తెంచుము |
| 53 | 22 | తత్తులం | తత్తుల్యం |
| 61 | 2 | యుంటునో | యుంటినో |
| 61 | 19 | బ్రిహా | గ్రిహా. |
| 64 | 15 | ద్వైపము | ద్వైపమా |
| 67 | 21 | కడదయార | కదుడయార |
| 71 | 8 | చీరం | భీరం |
| 76 | 6 | నెలుగనమ్మ | తెలియదమ్మ |
| 76 | 6 | (క్రింద) | వ్రతనిమిత్తంబట్టివాం ఛయేగానినా కిది పరీ క్షయటంచు నెలుగ నమ్మ ! |
| 76 | 10 | వైరమ్మలార | లైరమ్మలార |
| 80 | 20 | యుమూధవ | యుమాఘవ |

# ఇందువచ్చు పాత్రలు



అనసూయ : కథానాయిక — అత్రిమహర్షి భార్య.

అంబిక : ఒకమునిపత్ని . అనసూయకు సఖి.

నిరంజనుడు.
సనందనుడు.
జాతవేదుడు. } మునికుమారులు అత్రిమహర్షి శిష్యులు.

సుమంగళి, మదలత.
ప్రేమరూప, ప్రభావతి.
కాత్యాయని. } అనసూయయొద్ద చదువుకొను బాలికలు.

నారదుడు : సుప్రసిద్ధమహర్షి.

వాణి, రమా, పార్వతులు : త్రిమూర్తుల భార్యలు.

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు : త్రిమూర్తులు.

గరుత్మంతుడు : నారాయణుని వాహనము.

బ్రహ్మానందావధాని.
నారాయణభట్టారకుడు.
నీలకంఠయోగి. } వేషధారులైన త్రిమూర్తులు.

కశ్యపుడు, శుక్రుడు, తుంబురుడు, మహర్షులు.

అదితి - ఇంద్రునితల్లి.
శచీ - ఇంద్రునిభార్య.
శ్యామల - సోమునిభార్య.
రతి - మన్మథునిభార్య. } లక్ష్మీదేవి సభాజనులు.

దత్తాత్రేయుడు - అనసూయాత్రిమునులకు గలిగిన పుత్రుడు.

శ్రీ

# ౼ అనసూయా మహిమ. ౼

(నాటకము.)

ఇది.

గొర్లదిన్నె సుబ్బరాయ ప్రణీతము.

మ॥రా॥రా॥ బదినేహాళు తిమ్మారెడ్డి మహాశయ పరిపోషితము.

ప్రథమ ముద్రణ 500 ప్రతులు

గురునాథ ముద్రాక్షర శాలయందు ముద్రితము.

ఆదవాని.

1927.

అక్షయ సం॥ కార్తీక శు॥ ౧౨ ద్వాదశి



వెల. రు. 0—8—0

# ఉపోద్ఘాతము.



సుధీమణులారా !

ఈచిన్న నాటకము, బాలికలకు నీతిదాయకముగా నుండునట్టుల రచింపుమని ఆదవాని పురవాస్తవ్యులును, స్థానిక పరిపాలన సంఘాధ్యక్షులును, బహుళభూమీపతులును, బహుగ్రంథపతులును, బహుజనాభినుతులునగు మ॥రా॥రా॥ బదినేహాళు తమ్మిరెడ్డిగారు ప్రేరించుటచే నదేరీతి సులభశైలిని రచించినాను. కథకు సంబంధము లేదని సందేహింపఁబోవు నొక "పాఠశాల" రంగము పడుచులకుపయుక్తముగానుండు నుద్దేశముచే నిందేర్పఱుపఁబడియున్నది.

ఇది మహాపతివ్రతయగు ననసూయయొక్క మహాత్మ్యమును వెల్లడించుచున్నది. ఈసతీతిలకముయొక్క చరితమెంతయోయున్నది దానిలో ముఖ్యమైనది మాత్రముఁగాని నాటకావధి కనుకూలముగా వ్రాసినాను. క్షీరకథనము నాకల్పనము.

ఇఁక దత్తాత్రేయు జననమున నతఁడు మూఁడుతలలు గలవాఁడని నారదీయాంతర్గత నారద కృతస్తోత్రముచే నీదిగువ తెలియ నగును.

శ్లో॥ ఆదౌ బ్రహ్మా మధ్యేవిష్ణు రంతేరుద్రస్సదాశివః।
మూర్తిత్రయ స్వరూపాయ దత్తాత్రేయ! నమోస్తుతే॥

శ్లో॥ శ్యామశ్వేతారుణాంగాజల ధరణిధరోత్ఫుల్లపంకేరుహస్థా।
హోమాసావిత్ర్యుపేతా రక్షచరణ పినాకోగ్రహుంకారశస్త్రాః।
దేవాద్విత్ర్యష్టనేత్రా జగదవన సముచ్ఛేదనోత్పత్తిదక్షాః।
ప్రీతావః పాంతునిత్యంహరి హరివిధయస్త్ర్యగ్నిగోహంసపత్రాః॥

దీనిననుసరించి దత్తాత్రేయుఁడు శీర్షత్రయముఁగలవాఁడుగా

వర్ణించియున్నాను. తొలుత విజ్ఞాపించిన ప్రకారముద్దేశ మొకటి యయినప్పటికిని నాటకమగుటచేఁ గథాసందర్భము యథాశక్తిని రచించినాఁడ. ఎంతమట్టుకు సరసమో యెంతవరకు విరసమో పాఠకమహాశయులే కన్గొన సమర్థులు. మఱియే వేనిదోషములున్న క్షమింపఁ బ్రార్థితులు.

కారయితులు, ప్రేరకులు, అనుమోదకులునగు మ॥రా॥రా॥ తమ్మిరెడ్డిగారింబట్టి యీచిన్న కుసుమము శారద కర్పించు పుణ్యము లభించినందులకు నామహోదారమతికిఁ గృతజ్ఞతాభినందన మందించి విరమించుచున్నాను.

ఆదవాని. 1927.

గార్లదిన్నె సుబ్బరావు.

శ్రీ గురుభ్యోనమః

—♦ శ్రీ శారదాంబాయైనమః ♦—

# అనసూయామహిమ.



( నాంది )

క॥ శ్రీత్రిభువనగురు, ననసూ ।
యాత్రిమునీశ్వరకుమారు, నద్వయునిన్, మూ ।
ర్తిత్రయరూపుని, శ్రీద ।
త్తాత్రేయున్ భక్తితోడఁదలతున్ మదిలోన్ ॥

మ॥ రమణన్ బిల్లలు ఖేలనంబుసలుపన్ బ్రత్యక్షమందుండి, పి
ల్లల ముదంబొందుచునుందువారుకద !
తల్లుల్ దండ్రులున్, దత్ప్రికా ।
రహోమేమాడఁగఁజూడవచ్చిన సతీరత్నంబులున్ గోపికల్ ।
ప్రమదంబొందెదరాత్మలందనుచునే భావింతునిక్కంబుగాన్ ॥

(నాంద్యంతమున, సూత్రధారుఁడు)

నటీ !

నటి. (నేపథ్యమున) ఇదేవచ్చితిని.

సూ. నటీ ! నటీ ! ఏమిచేయుచున్నావు ?

నటి. (నేపథ్యమున) ఇదేవచ్చితి.

సూ. సరియే ! నేనిట్లే పిలుచుచుండెదను. నీవదేవిధముగా వచ్చి
తిని, వచ్చితిని, యని యనుచుండుము.

( నటి ప్రవేశము. )

నటి. ఇదిగో, వచ్చినాను. ఏమి సెలవు ?

సూ. ఏమిసేయుచుంటి వింతవఱకు?

నటి. నాథా! మీకడ నేనేమి సమాధానముఁ జెప్పఁగలను? చెప్పకున్న మీకుఁ గోపమువచ్చును.

సూ. ఏమి? చెప్పుము.

నటి. ఈపీతాంబరపుఁ గొనచెఱఁగు హంసబిల్లకుఁ దగిలియుండఁగ నిలువుటద్దంబులలోఁజూచి దానిని విడఁదీసికొని వచ్చితిని. నాయాలస్యమున కిదియేకారణము.

సూ. సరే! మఱేమున్నది? మీకెప్పుడును వస్త్రములు, సొమ్ములు, సొగసులు, వేఱేచింతయేలేదు. నేఁబిలచినప్పుడు తత్క్షణమే గావలదా? ఇదియేనా పతివ్రతా ధర్మము!

నటి. ఓహో! ఇంతస్వల్పమునకే మీరిట్లు శాస్త్ర ప్రకారము మాటలాడిన నేనేమి చెప్పఁగలను! నేను, ఉమనా? రమనా? సీతనా? అనసూయనా—

సూ. ఓహోహో! చాలు, చాలు, వారునీవలె మానవులు కారా?

నటి. ఉమా రమా దేవులా?

సూ. వారిని విడిచిపెట్టుము, సీతానసూయలు?

నటి. ఔను, మానవులే.

సూ. వారివలె మీరేల వర్తింపగూడదు? ఏల ప్రఖ్యాతిఁ బడయరాదు?

నటి. నిజమే, చాల—కష్టము—

సూ. అదియే నేఁజెప్పబోవునది. కష్టపడనిదే కీర్తిలభించునా! కాబట్టియే నూఱుమాటలకన్న నొక ప్రదర్శనమే మేలని యెంచియున్నాను.

నటి. మీ చిత్తము.

సూ. అయిన, నెవరి చరితమును? ఉమాచరితమా? రమాచరిత్
మా? వాణీ——

నటి. వారి ముగ్వురిని మించినవారి చరిత్రమును.

సూ. ఆహా! అనసూయా కథయా? నీవు బుద్ధిశాలినివే. ఇందు
కుం దగిన జ్ఞాపకము గావలయుంగదా!

నటి. ఇంతలోనే మఱచితిరే? దానినిం జదివి యెనిమిది దినములు
కాలేదు. బాగున్నదంటిరి, ఖేలన మొనర్తుమంటిరి.

సూ. ఎన్నిరో చదువుచుందును. ప్రశంసించుచుందును. ఎక్కడి
వరకు జ్ఞాపకము. గ్రంథకర్త యెవరు? జ్ఞాపమునందున్నదా?

నటి. లేకేమి?

గీ॥ ధాత్రి వెలసెడు కౌండిన్య గోత్రజాతుం।
డాఱువేల ప్రసిద్ధవంశాబ్ధి వీచి।
అమలమతి పెద్దనారాయణార్యసుతుండు।
ప్రాజ్ఞసంసేవి, గా॥ సుబ్బరాయసుకవి॥

సూ. ఓహో! రామకుమారాభ్యుదయ నాటక కర్తగదా
యితండు?

నటి. ఔ నతండే.

సూ. సరే! ఇతని "అనసూయ" నాటకము ప్రౌఢ నాటకము
కాదని తోచుచున్నది. నాటక మర్యాద ననుసరించి
బాలికల కుపయుక్తముగా సులభముగా రచించినట్లున్నది.

నటి. అయిననేమి?

క॥ బాలికలె యానవిజితమ।
రాళికలై, స్త్రీసుధర్మ రమణీయమణీ।
మాలికలై, మదరోలం।
బాలకలై పెరిగి యువతులగుదురుగాదె॥

సూ. అబ్బబ్బ ! మాటలు మాత్రము కోటలు దాటుచున్నవి.

నటి. నామాటలుతో నేమి ? మీనాంది కానిండు.

సూ. సరిపోయె. ఎన్నఁడో యయినది. అపుడే కరదాళధ్వనుల సంపాదించితిని.

నటి. బళీ ! మీనాంది పద్యమునకే కరతాళధ్వనులా ? ప్రేక్షక మహాశయులు సులభసంతోషులే. నాపాటకింకఁ జప్పట్లు కొట్టకుందురెట్లు ?

మ॥ కో॥ మీరునాందినొనర్చి యీసభ మెచ్చఁజేయు, మదీయగీ ।
తారసంబుసుధారసంబయి తారసిల్లుచుఁదచ్ఛ్రివః ।
పూరమైసుఖసారమై మది,బొంగఁజేయు దెలేకయా ।
నారదుణ్ణగనిగానయుద్ధ మొనర్పరమ్మనిచీరదే ॥

సూ. ఆహా ! ఏమి, నీవిద్యాగర్వము ?

(నే ప థ్య ము న)

"ఓసీ ! నీ వెవ్వడవు ? నన్ను గాన యుద్ధమునకు రమ్మనెదవా ? నీవు పాటనేర్పరి వగుదువుగాక. నీకింత గర్వమేల. ఇదే వచ్చుచున్నాను"

నటి. నాథా ! నారదుఁడే వచ్చినట్లాయెనే ?

సూ. అతఁడు ముల్లోకములఁ గ్రుమరుచు నన్నింటిని గనుచుండును, వినుచుండును. ఇంక మసలితివేని నీకు గర్వభంగమగును.

నటి. ఔను, దిగులగుచున్నది. పోదము పదుండు. (నిష్క్రమణ)

(ఇ ది ప్ర స్తా వ న.)



# అనసూయామహిమ.

## ప్రథమాంకము. — ప్రథమరంగము.

అరణ్యము. ప్రవేశము. నారదుఁడు.

నార. ఓసీ! గానవిద్యా విశారదా! గర్వ ప్రలాప! నీవెవఁడవు? (అటు నిటు చూచి) ఏమిది? ఎవరును లేరే! ఎవఁడో యొక యల్ప విద్యావంతుఁడు తన దంభము చెప్పుకొనుచుండెఁ గాఁబోలు. నేను నొకట రెంట నిట్లు గర్వపడినందులకు శ్రీహరి నాకుఁ జక్కని పాఠము నేర్పియున్నాఁడు. అట్టి పాఠము నేనితరులకు నేర్పుచుందునని చెప్పి యతని యాజ్ఞఁ బొందియున్నాను. ఓరమారమణ! నీమాయావిశేషమును, నీదయను నేనేమని పొగడుదు!

సీ॥ మా॥ దురభిమానంబు గలిగినవొడ్డవారి।
నొడల జెనొఁపట్టి మహాయమహిమదలిర్ప।
మాకి గర్వంబడంచిన వాఁడవీవు।
గర్వరహితుల సంపూర్ణకరుణచేతఁ।
బ్రోచినట్టియు, ప్రోచెడు ప్రోడవీవు।
నిన్నుఁ బొరము ముట్టనే నెన్న నేర।
నిగమసంచార! సువిచార! నిర్వికార।
సజ్జనాధార! సముదార! సత్యసార॥

ఈ తపమునకు ననేకులకు దురభిమానముఁ దొలఁగింపఁ జేసి యున్నాను. ఇప్పటికి త్రిమూర్తుల సతులగు వాణీ రమా

పార్వతులు గనఁబడుచున్నారు. .సకల స్త్రీ ప్రపంచమునఁ జెక్కువవారే. ఒకించుక గర్వము మాత్రము గలిగియు న్నారు. వీరి ముగ్గురికి నొకసారి పాఠము నేర్పవలెనని తలఁచుచున్నాను. సమయము రాలేదు. ఈభూలోక సంచారము నింకఁ జాలించి దేవలోకములకుఁ బోవనెంచినాను. ఈ వనమునందెవ్వరేని తాపసులుండిన యెడల దర్శించిపోయెదను. (వనమును జూచి) ఆహా ఇంత మనోహరముగా నుండు వనసీమయందు మునులు లేకుందురెట్లు!

సీ॥ దారిఁబోయెడువాని దాఁటనీయక
తమముద్దుపల్కులచేత నొద్దకీడ్చు ।
తమఘుమంఘుమ యను తావులచే
ముక్కుబట్టి, కదలకుండనట్టెనిలుపు ।
ఎండనేలకుఁబడకుండ మెండుగనిండి
యుండునీడలను గూర్చుండఁజెట్టు ।
మెల్లగాఁజల్లగా మెయిసోకిపోయి
సంధిల్లనెల్లెడ నత్తమిల్లఁజేయు ।

గీ॥ నిచట నెలకొన్న గువ్వలు నిచటిపువ్వు ।
లిచటిదట్టంపుతరుపాళి యిచటిగాలి ।
నెంతవర్ణింతు నిటవసియించువాని ।
సౌఖ్యమేసౌఖ్యమని చెప్పసందియంబె ॥

ప్రవేశము నిరంజనుఁడు (మునికుమారుడు)

“ సనందనా ! సనందనా ! ” (అని వచ్చి నారదునిజూచి)

నిరం. తాతా ! మీరెవ్వరో ! నమస్కరించుచున్నాను.

నార. నీకు శుభమగుగాక ! బాలకా, నీవెవఁడవు?

నిరం. నేనొక మునికుమారుఁడను.

నార. అది చెప్పనక్కరలేదు. నీపిల్ల జుట్టువలనను, గావి బట్ట వలనను, చేతనున్న పూలబుట్ట వలనను, ముని సుతుఁడవని యెఱుఁగనయ్యెడు. నీపేరేమి? ఎవరి పుత్రుఁడవు?

నిరం నాపేరు నిరంజనుఁడు, నిత్యానంద ముని కుమారుఁడను.

సనం. సనందనుఁడెవఁడు?

నిరం. నాసఖుఁడు, శతానంద మహర్షి పుత్రుఁడు.

నార. పుష్పార్థమో సమిధల కొఱకో వచ్చియుంటిరే?

నిరం. ఔను.

నార. అయిన, నీస్నేహితుఁడిచటికి రాలేదు, వానిని వెదకఁబోము.

నిరం. వలదు వానిపూలబుట్ట నిండుదనుక వచ్చువాఁడు కాఁడు. ఇంతలోనే రావచ్చును. మీరు దయచేసి నావెంట రావలయు. మాయాశ్రమమునకుఁ బిలుచుకొని పోయెదను. మా యాతిథ్యమును గైకొనిపోవలెను.

నార. (స్వ॥ ఇది పెద్దల నేర్పుగాఁ దోచుచున్నది.) మీయాశ్రమము లిచటికి సమీపమున నున్నవా?

నిరం. మాతండ్రిగారివికావు. గుర్వాశ్రమము.

నార. అటులనా? గురుకులవాసము చేయుచున్నారా? మీగురువు గారెవరు?

నిరం. అత్రిమహర్షి గారు.

నార. (స్వ॥ ఆహా! అత్రిమునీశ్వరుని యాశ్రమ సీమయూనే వచ్చియుండునది. వారిని దర్శింపవలె.)

ప్రవేశము సనందనుఁడు.

నిర: జనా! ఎచ్చటనున్నావుర?

నిరం. తాతా! వీఁడే నామిత్రుఁడు.

సనం. తాతా! వందనములు.

నార. దీర్ఘాయుష్యమస్తు.

సనం. తాతా! నీవు నారదుఁడవా? తుంబురుఁడవా?

నార. అదెట్లు?

సనం. "నారద తుంబురులు వీణాగానమున నేర్పరులు. ఎల్లప్పుడు హరిని గీర్తించుచుందురు" అని మాయొజ్జలు చెప్పుచుండు వారు. నీవు వీణియను ధరించి యున్నందున నడిగితిని.

నార. ఔరా! నీవు బుద్ధిశాలివే! నేను నారదుఁడనే.

సనం. అయిన, మాపర్ణశాలకుఁ బాదముంచుఁడు. మాయాశ్రమ సీమలో నెట్టి యతిథులు గన్పించినను దప్పక కొనిరావలెనని మాగురువుగారును గురుపత్నిగారును ఆజ్ఞఁ జేసియున్నారు.

నిరం. నేనపుడే విన్నవించినాను.

నారద. ఒకవేళ రామన్న నెట్లు?

సనం. రామన్న కాదు, భీమన్న కాదు. ఉత్తరీయమును బాదములకుఁ జుట్టి తోడ్కొని రావలెనని యనసూయాదేవిగారి యాజ్ఞ.

నార. అయ్యో! అంతపనివలదు, ఇదేవచ్చెద, నడువుఁడు.

నిరం. నీవీణను నేఁ దెచ్చెదనిమ్ము, నీకు బరువేమో?

సనం. అంతలావున్నది, బరువులేకుండునేమిర? తాతా! నీచిటుకులు నాకిమ్ము, నేఁగొనివచ్చెద.

నార. అయ్యో! వలదు. నేనే తెచ్చెద. పదుండు.

నిరం. ఇటురమ్ము, ఇటురమ్ము.

నార. (స్వ॥ అతిథులకిట్టి గృహస్థులుకదా యుండవలయు, బాలకులకిట్టిదికదా గురుభక్తి.) (నిష్క్రమింతురు.)

## ప్రథమాంకము — ద్వితీయరంగము.

(పర్ణశాల) అనసూయ కూర్చుండి యుండును.

అంబిక ప్రవేశించును.

అం. అనసూయా దేవీ! పోయి చూచివచ్చితిని. దూడకుఁగూడ పాలు లేవు.

అన. అదేల?

అం. భాగీరథిని రాత్రి నింటిలోఁ గట్టుకొనుటకు మఱచితిని వెలుపల మావిచెట్టునకే కట్టఁబడియుండె. ఏపులియో చిఱుతయో పాలనన్నిటిని గుడిచి పోయినది.

అన. అంబికా! నీవు మందమతివే! ఇపుడెట్లు? మనకు లేకున్న మాన్, దూడ గతియేమి?

అం. అమ్మా! క్షమించుము. నీచేతితోఁ గొన్ని జలములనిమ్ము, ఆ లేగకుఁ ద్రాపెదను. అది పాలు ద్రావినట్టే సుఖముగా నుండును. మహర్షిగారింటలేనందున వారు వచ్చుటవఱకు నీ వెట్టి యాహారమును గైకొనవుగదా? మాకొకదినమునకుఁ బాలులేక పోయిననేమి? వలయునన్ని ఫలములున్నవి.

అన. నీసమాధానపుఁ బల్కులు సరియే. ఒకవేళ నకస్మాత్తుగా నతిథులెవ్వరేని వచ్చిన నేట్లు?

అం. సాధ్వీమణీ! నీళ్ళులేకున్నను నీకరకమల స్పర్శచే గోముగాఁ బెరుగుచున్న పూలతీవెల నడిగి యప్పటికుపాయముఁ జెప్పెద.

అన. నీ యిష్టము.

ప్రవేశము. నిరంజనుఁడు, సనందనుఁడు.

(పుష్పముల నచటఁబెట్టి నమస్కరించి)

నిరం. అమ్మా! నారద మునీశ్వరులు వచ్చియున్నారు.

సనం. అవ్వా! నీయానతి మేరకు మనయింటికి విందుగాఁడో డ్కా నివచ్చినాను.

అన. ఏకీ! వారెక్కడ?

అం. వెలుపటఁ గూర్చుండినారా?

నిరం. లేరు, భజన మొనర్చుచు వెనుక నరుదెంచుచున్నారు.

అన. అన్నలారా! అట్లు విడిచి రాదగునా? వెంబడిగా రావలయుఁగదా!

ప్రవేశము. నారదుఁడు.

స్రగ్విణి॥ నారసింహాచ్యుతా! నక్రసంహారకా!
మారజిద్వందితా! మామనోహారకా!
వారిజాతేక్షణా భక్తబృందావనా!
ధీరసంరక్షణా! దేవసంభావనా॥

అన॥ గీ॥ సర్వలోకంబుల సతంబు సంచరించి।
అచ్యుతునిభక్తి మాబోటియజ్ఞులందు।
నాటిరక్షించు నీకిదే నతులొనర్తు।
బ్రహ్మమానసపుత్ర! పావనచరిత్ర॥

(అని మ్రొక్కును, అంబికయు నమస్కరించును.)

నార. దీర్ఘసుమంగలీభవ! తపఃఫలసిద్ధిరస్తు.

అన. నిరంజనా! పాద్యముఁదెమ్ము. అంబిక! తట్టయు నొక వస్త్రముఁ గొనిరమ్ము. సనందనా! వ్యాఘ్రాజినము. (వారు పాద్యము మున్నగునవి తెత్తురు.—నారదుని కాళ్ళుఁ గడిగి తత్పాదోదకమును శిరమున జల్లుకొని)
సనందనా! ఏలతడవు?

సనం. అమ్మా! వచ్చితి. మామిడి కొమ్మపై నారవైచియుండిన

యాదోవతియుఁ చీరయు గాలికెగిరి పోయుచుండ రెండు క్రోతులుపోయి వానినిఁదెచ్చి మరల నాకొమ్మపైనునిచినఁ జూచి తీసికొని వచ్చితిని. ఇదియే నాజాగు. (నారదుఁ డాశ్చర్యపడును.)

అన. సంతోషము. లోపలనుంచిరమ్ము. (వ్యాఘ్రాజినము పఱచి) మునీంద్రా! ఇచ్చట నాసీనులరగుఁడు.
నిరంజనా వట్టివేళ్ళ వీవన. (వాఁడు దెచ్చి విసురుచుండును.)
మహానుభావా! నేడు సుదినము. మాయూరుకుటిల్లు పవిత్ర మయ్యె. మేము ధన్యుల మైతిమి.

నార. అమ్మా! పుణ్యవంతుల దర్శనమయ్యె. నాకును సుదినమే అత్రిమహర్షిగారాశ్రమమున లేరా?

అన. లేరు. నేఁడుదయముననే తపస్సునకు వెడలియున్నారు.

నార. ఎప్పుడువత్తురు?

అన. ఏమో, తెలియదు. ఎనిమిది దినములో, పది మాసములో.

నార. ఆహా! వారిని దర్శించు భాగ్యము లేకపోయెనే అమ్మా!

ఆ॥ వె॥ తపములెట్టి యిష్టదగూలక జరుగునే ;
దుంపలును ఫలములు దొరకునొక్కొ ।
నీరుజిక్కగలదె చేరువనే ? కూళ ।
దక్కనులెవరు నిటురారుగాదె ॥

అన. స్వామీ! మీయనుగ్రహమున నెట్టికొఱంతలుం లేక సుఖముగా నున్నాము.

సనం. తాతా! మనత్రోవలోఁ జూచితిమే కోలను, అదియే యొల్లప్పుడును మమ్ముఁ దనుపుచున్నది. నీళ్ళు టెంకాయ నీరు,

నార. చేనటి మెకముల వెఱపులేదుకద?

అన. అట్టివేవియులేవు.

అం. మునితిలక! పులులు సింగములు మున్నగునవి రాత్రులయందు మాపర్ణశాల యొద్దనే పరుండియుండు. అవియే మమ్ముఁగాచు చున్నవి. అంతేగాక మాగోవుల పాలనప్పుడప్పుడు ద్రాగి పోవుచుండు. అది నేమను దటస్థించినది.

సనం. ఆపులుల సింహములనెక్కి మేము సవారి చేయుచుందుము. ఈవ్యాఘ్రాజినముకన్న వానిదీవు మెత్తగా నుండును.

నార. సంతోషమయ్యెడు. (ఆహా! ఈఋషి దంపతుల సత్వగుణ ప్రభావము నేమనవలె! )

అన. జడదారిరాయా! ఎచ్చటెచ్చటఁ దిరిగితిరి. ఎచ్చటికిఁబోవ లెన్ను?

నార. భూలోకమంతయు సంచరించివచ్చినాడ. ఇపు దేవలోక మునకుఁ బోవనెంచినాను.

అన. మీసంచారమున గాంచిన విశేషము లేవియైన గలవా?

అం. వారు జూడని విశేషము లుండునా? అనేకముల గనుగొని యుందురు.

నార. అమ్మా! నిక్కమే, ఒక్కమాటలో వక్కాణించెద.

మ॥ మతిమంతుల్, హరిభక్తితత్పరులు, నిర్మాత్సర్యచిత్తుల్, సతి।
వ్రతలుఁ, సద్గుణశీలలుఁ సుఖములఁ వర్ధిల్లఁగాఁగంటి దు।
ర్మతులుఁ శ్రీహరిభక్తిదూరులును, దుర్మార్గుల్, పతిప్రీతి వ।
ర్జితలుఁ దుశ్చరితల్ వగల్ బొగులుచుఁ జీవింపఁగాఁగాంచితిఁ॥

అన. అట్టిదియేకద! సన్మార్గులే సౌఖ్యవంతులు. దుర్మార్గులే దుఃఖ వంతులు. వారిలో మాత్రము స్త్రీజన్మము పతుల సేవింపక పతుల ప్రేమనాకర్షింపక పతుల యాజ్ఞ మెలంగకున్న నేమి ప్రయోజనము. ?

ఆ॥ వె॥ తల్లిఁదండ్రివిడిచి, తానొక్కమగనికి ।
బెండ్లమగుచు నతని వెంటనంటి ।
జీవయాత్రనలుపు చేడియభర్తను ।
గొలువకున్న సుఖముగలుగు నెట్లు ॥

పురుషుల కనేక పుణ్యకార్యము లేర్పడియున్నవి. స్త్రీలకుఁ బతిసేవయొకటి యేర్పడియున్నది. పురుషులాయా పుణ్యకార్యములచేఁ బడయు పుణ్యము పడతులు తమ పతిభక్తిం బట్టి పడయుచున్నారు. ఈమాటనేఁ జెప్పనేల సకల శాస్త్రములు "పతిని దైవముగానెంచిన సతికి మోక్షము నయితము నఱచేతనుండు" నని ఘోషించుచున్నవి. మీరు విన్పించిన వార్తయందన్నృత మేమున్నది? కావున

సీ॥ దినమునుముమ్మారు తిరిగిపతికి
మ్రొక్కనరుగని పదములకందెలేల ।
పతిపాదములనొత్తి భక్తిసేయని
చేతులందుదాల్చిన బాజుబందులేల ।
పతియడ్గులనుసోకి ప్రణమిల్లకుండిన
శిరముధరించు నాగరములేల ।
పతియాడుమాటను బహులాదరవినని
కర్ణములకు తాళ్ళకమ్మలేల ॥

గీ॥ విభునికుపచారములను గావింపనట్టి ।
తనవుగట్టెడు కనకవస్త్రంబులేల ।
పతియె దైవంబటంచు హృత్పద్మమందు ।
నమ్మకుండినసతికిఁ బ్రాణమ్ములేల ॥

నార. అమ్మా! సత్యమే. నీపల్కులొప్పుఁ దగినవిగానున్నవి.

అన. మహాత్మా! ప్రస్తావవశమున మీతోఁగొంత మందలించితిని. మీరెఱుంగని ధర్మము లేవికలవు? ఇటుల నేనెఱిగినంత మట్టుకు నీప్రాంతముననుండు మునిపుత్రికలకు స్త్రీ ధర్మముల బోధించుచున్నాను.

నార. మిక్కిలి యుత్తమమైనపని. సందేహమేమి? (స్వ॥ ఈమె యిన్నిటిని చెప్పుచున్నది. ఇక్కడికి వచ్చినందులకు నీపెను గొంతిపరీక్ష సేయవలయు. ఏమియుక్తి యోచింతును!

అన. అనఘా! మధ్యాహ్నమయ్యె! స్నానమునకు లేవఁదగు. తమ కేమి కావలెనో సిద్ధపరచెదను.

నార. అవశ్యము. (స్వ॥ ఇదియే పరీక్షా సమయము-ఆలోచన నక్షీనయించి-తోచినది. ఈదినము పాలు లేవని వీరిసంభాషణవలనఁ దెలిసె. పాలనే కోరెదను. ఎట్లుచేయునో చూచెదను.) అమ్మా! నాకు మఱేవియు వలదు గోక్షీరము కావలెను. అత్యావశ్యకము గనుక యడుగవలసి వచ్చినది. నూటయొక్క దినము రుద్రాభిషేక వ్రతము ననుసరించి యున్నాను, నిన్నటికి నూఱుదినములయినవి. నేడు కడపటి దినము. నూటయొక కలశములుగాని లేక యన్నిశంఖముల యావుపాలు జిక్కినఁ జాలు. నావ్రతము పరిసమాప్తి యగును, అట్లు దొరకని పక్షమున శంకరుని క్షీరాభిషేకమొనరించు నంతవఱకు నే నెట్టియాహారమును బుచ్చుకొనవలనుగాదు.

అన. స్వామీ! ఏలకాదు? మీకెన్ని పాలుగావలెనో యన్ని గ్రహింపుడు, తెచ్చెదను. మీవ్రతము పరిపూర్ణమొనర్పుఁడు నాయిల్లు పవిత్రమగును. మీరు స్నానము సలిపి పూజకు ప్రక్రమింపుఁడు.

నార. సంతోషము. (లేచి లోపలికిఁ బోవును.)

అన. నిరంజనా! సనందనా! వారికిఁ గావలసిన పూజాద్రవ్యముల సిద్ధపఱపుఁడు. (ఇద్దఱు నిష్క్రమణ)
ఆహా! ఈమునీంద్రుఁడు లేనివస్తువునే కోరె. అదిలభింపకున్న నతనికి భోజనమే లేదట. ఇంటికి వచ్చిన యతిథి యుపవాసములో మరల వలసినవాఁడాయె. అయ్యో! ఎట్టిపాపము? అంబికా! నేనప్పుడే చెప్పలేదా? ఇప్పుడు పాలకై పరీక్ష గలిగె చూడుము.

అం. అమ్మా! ఇదేమి వ్రతము, చిత్రముగానున్నదే? నూఱుశంఖముల పాలుపై నొకశంఖము.

అన. ఎన్నియో వ్రతములు. వానిలో నిదియొకటి యుండవచ్చును. దానిప్రశ్న మనకేల?

అం. తొలుత మనసంభాషణలో మనయావు పాలియ్యలేదని నోరుజారి పల్కితిసే. పరీక్షార్థ మిట్లడిగియుండునా?

అన. సఖి! ప్రసంగవశమున నాడినమాటలన్నిటిని నతఁడు వ్రాసికొనినాఁడా? తనవ్రతమునకొఱకు కావలసిన పదార్థమునుగోరినాఁడు. తనసంచారమున మనము పిలిచినంతట వచ్చెఁగాని మనలఁ బరీక్షించుటకు వచ్చినాఁడా! ఇట్లేల యూహాలు? భాగీరథిని దోడ్కొనిరమ్ము. నాహృదయేశ్వరుని కమండలువు నొక భాండమును దెమ్ము.

(అంబికపోయి తీసికొని వచ్చును)

(అనసూయ గోవునకుఁ బ్రదక్షిణ నమస్కారి మాచరించి కమండలువు జలములఁజల్లి)

మ॥ జగతిఁ నాదగునాథుఁడుత్తమ తపస్సంపన్నుఁడేనిఁ నిజం
బుగఁదత్పాదయుగంబు భక్తిమయిసంపూజింతునేనిఁ సదా।
భగవత్సేవనొనర్తునేని యిపుడీభాండమ్ముసంబాలు నిం।
డుగగోలక్ష్మి! యొసంగిమానిఁ బరితుష్టుంజేయవే వేడెదఁ॥

(అని యావును బిండి)

అంబికా! ఈక్షీరముల నారదునకిచ్చి, కలఫలములనెల్ల నొకపోకపట్టలో నుంచిరమ్ము. (అంబిక పోయి వచ్చును)

అం. అమ్మా! మునీంద్రుఁడు పాలనుజూచి సంతోషించి చాలునని చెప్పినాఁడు. అభిషేకమును గావించుచున్నాఁడు,

అన. అయిన నీయావును గట్టిరమ్ము. (అంబిక నిష్క్రమణ)

(మరల ప్రవేశము.)

అం. సతీమణీ! ఆమొదపు పొదుగున నింకను బాలున్నవి. లేఁగ మొదమునఁ ద్రాగుచున్నది.

అన. సంతసము.

(ప్రవేశము నారదుఁడు.)

హర! శంకర! హర! శంకర!

పతివ్రతామణీ! నావ్రతము సంపూర్తిఁగావించితివి. నాకు మహానందమయ్యె, నీవొసఁగిన ఫలములు మెసఁగితి. సంతస మొసఁగె. నీదగు పతిభక్తి నేనేమని పొగడుదు? నీమహిమ నేనేమని కొనియాడుదు! నాకిక సెలవియ్యవలెను. నీకు సర్వకాలముల సర్వశుభములగుఁగాక. అత్రిమహర్షిగారు విచ్చేసినపుడు నాప్రణామముల నర్పింపవలెను.

అన. అనఘా! అటులనే విజ్ఞాపించెదను. పోయిరండు మాయందు

కటాక్షముంచుఁడు. మీరు బ్రహ్మలోకమునకుఁ బోయినప్పుడు సరస్వతీదేవితో నిట్లు విన్నవింపుడు.

ఆ॥ నీదునింపు కరుణ నెగడెడుపుత్రు ।
నొకనిమాట నొక్కఁడొప్పకుండ ।
వాదులాడుచుండ్రు, వారలకైకమ ।
త్యంబుఁగూర్చి కావుమమ్మవాణి ॥

వైకుంఠమునకుఁ బోయినపుడు లక్ష్మీదేవికినమస్కరించి యిట్లు విజ్ఞాపింపుఁడు.

ఆ॥ నూటికొకనిదయఁ గనుంగొనుచుండెద ।
వల్లయగునుగాక, యట్టిసుతుఁడు ।
త్యాగిగాను, ధర్మదాక్షిణ్యపరుఁడుగా ।
నలరునట్లు సేయుమమ్మ, పద్మ ॥

కైలాసమునకుఁ జనినవేళ సర్వమంగళాదేవికి నానతుల నర్పించి యిట్లు మనవిసేయుఁడు.

గీ॥ నీకృపాలోకనము చేతనెలతలెల్ల ।
రఖిలమంగళముల, బొల్తు, రయిన, వారు ।
చండికలుగాక, మగలనుసగముసేయ ।
ఖండవర్తించునట్లు సేయుము భవాని ॥

నార. (స్వ॥ ఈమె సందేశములు నాకు మిక్కిలి యనుకూలముఁగా నున్నవి. త్రిశక్తుల గర్వము నణఁచుటకు సమయము కలిసి వచ్చె. ఈమె వలననే సాధ్యమగునని తోఁచుచున్నది.) అమ్మా!నీమాటలు దప్పక చెప్పెదను. నేనింకఁ బోయి వచ్చెద. (నిష్క్రమణ)

ప్రవేశము సుమంగలి.

దేవీ! పడుచులందఱు వచ్చియున్నారు. పాఠవేళయయినది.

అన. పోదము. అంబికా! బాలురకు భోజనమిడుము. పొమ్ము. (అందఱు నిష్క్రమింతురు.)



## ప్రథమాంకము—తృతీయరంగము.

వనసీమ. బాలికాపాఠశాల.

అనసూయ, సుమంగలి, కాత్యాయని, ప్రేరూప, ప్రభావతి, వనలత, (బాలికలు)

అన, వనలత! పిల్లలకు మొదటి దైవతము లెవరు?

వన. తల్లిదండ్రులు.

అన. ఏల?

వన. కష్టపడి, కనిపెంచిన వారగుటచేత.

అన. వారియెడ నెట్లు మెలఁగవలయు?

వన. తు॥ వ॥

తల్లిమాటయమృతధార, తండ్రిపల్కుపంచదార।
కల్లగాదటంచునెంచి, కడువిధేయతకవహించి।
వారియాజ్ఞనడువవలయు, వారిబుద్ధివినగవలయు।
కోరరాములేనిదాని, కోపగింపకెన్నఁడేని॥

అన. కూర్చుండుము. ప్రభావతీ! తల్లిదండ్రుల మాటవినక పాఠముఁ జేసినయెడల నేమగును?

ప్రభా. అట్టిబాలికను ప్రేమింపరు, కొట్టుచుందురు. అంతేకాక యా బాలిక గయ్యాళియని పేరొందును.

అన. పడుచులెట్టివి సేయరాదు ?

ప్రభా. ఆ॥ వె॥

తలను, జీర, బొట్టుఁదామాపుకొనరాదు ।
మాపుజేపునిదుర మఱుగరాదు ।
పెద్దవారిమాట వినకుండఁబోరాదు ।
చెలులతోడఁ దగవుసేయరాదు ॥

అన. కూర్చుండుము. ప్రేమరూప ! బిడ్డల్లు మఱెట్టివి నేర్చుకొనవలెను.

ప్రేమ. ఉత్సా॥

తల్లినేర్పుపనుల నెల్లఁ దాను నేర్చుకోవలెన్ ।
ఉల్లమలరమంచి పాటలోలి నేర్వఁగావలెన్ ।
పిల్లలెల్లఁగూడితగిన విద్య నేర్వఁగావలెన్ ।
ఎల్లవారిమొదలమగుల హితముఁజూపఁగావలెన్ ॥

అన. అట్లు సేయకున్న నేమి ?

ప్రేమ. తెలివిలేనిదగును, తగవులాడి యగును.

అన. అంతేనా ? కన్నవారికి——

ప్రేమ మాటఁదెప్పించును.

అన. కూర్చుండుము. కాత్యాయిని ! కన్యకకుఁ దలిదండ్రులు తర్వాత దైవమెవఁడు ?

కాత్యా. తనమగఁడే.

వన. ఉపాధ్యాయీ ! నాకొక సందియము. తల్లిదండ్రులు దైవసములు, మగఁడు దైవసముఁడు, అని చెప్పితివి. కాఁగ వీరిని గన్నవారు రాక్షసులా ?

అన. ఛీ ! వారును దేవతాసమానులే. మీజననీజనకులువలె మీయత్తమామగారలను మిమ్ముఁ బ్రేమింతురు.

వన. అంత ముద్దు సేయుదురా?

అన. మీరు వినయముతోడను గౌరవముతోడను వర్తించిన తమ పుత్రునియందువలె మీయందును బ్రియముఁ గలిగియుందురు. ఒక వేళ నప్రియముఁ జూపినను మీ భక్తిని విడువరాదు. మీకు గీర్తిప్రదము వ్రాసికొనుడు.

కాత్యా. (వనలతనుజూచి) అత్తమామగార్లను భక్తితో సేవింపకున్న భర్తకుఁ గోపమెత్తదేమే?

అన. చూడుము. కాత్యాయని బుద్ధిమంతురాలు. ఈమాటనపిం తమ వ్రాసికొనఁడు. కాత్యాయనీ! భర్తయనగానర్థమేమి?

కాత్యా. తనసతి నెల్లప్పుడు భరించువాఁడు.

అన. అందుచేతనే—

కాత్యా. దేవసమానుడు.

అన. పద్యము వచ్చునా?

కాత్యా. వచ్చును.

సీ॥ రాష్ట్రంబులనునేలు రాజాధిరాజైన,
కొనకునీచవు సేవకుండునైన।
సకలశాస్త్రంబులఁ జదివినవాఁడైన,
మూఢతముండగు బోయదైన।
బహుధనంబునుగల్గి వర్ధిల్లువాఁడైన వీధి,
గట్టెలనమ్ము పేదయైన।
బాగడనలవిగాని భూనేతయైనను,
బచ్చికదోకొడువాఁడునైన।

గీ॥ తనయదృష్టాను సారంబు దైవమిచ్చి।
నట్టిపాయసంబైనను వట్టిగంజి।
మైనతనయాలికిచ్చుఁ బ్రియంబుతోడ।
వాఁడెభర్తయు, బరమదైవంబుసతికి॥

సుమ. అవ్వా! నాదియొక ప్రశ్న.

అన. ఏమి?

సుమ. పతి ధనికుఁడుగాకున్న, గోరినవెట్లు తెచ్చును?

అన. అట్టిమగని నెవ్వియును గోరఁగూడదు. అతఁడు మచ్చికతోఁ దెచ్చినదియే హెచ్చని తలంచి పుచ్చుకొనవలెను. ప్రియమే ముఖ్యమయినది, వస్తువులుకావు. ధనవంతుఁడెంత ప్రియముతోఁ దనకాంతకుఁ బాయసము నిచ్చునో బీదవాఁడు నంతటి ప్రేమతో తనయింతికి గంజినిచ్చును.

సుమ ఇంతులకు వివిధములగు సొమ్ములు చీరలు వలదా? అందమెట్లువచ్చును?

అన. అదియే భ్రాంతి. సౌందర్యమే యందము, కానబహువిధ వస్త్రాభరణములుకావు. అవి యలంకారాతిశయమునకు నానందాతిశయమునకు, కలిగియుండిన ధరింపవచ్చును. లేకున్న నాసపడరాదు. నిండుజాబిల్లివలె, విడిగిన తమ్మివడువున పసిడి తీగెలాగు, క్రొక్కారు మెఱుపు తెఱఁగు వలువ తెలవకు వేఱుసొమ్ములేల. సకల సుందరులకు శాశ్వతమైన యాభరణములఁ జెప్పెద, వ్రాసికొనుఁడు.

సీ॥ ఇల్లిల్లుపనిలేక యెప్పుడుఁదిరుగఁ
బోకుండుట పదములకొక సొమ్ము।
బిచ్చగానికిదయఁగ బిడికెడన్నముఁబెట్టఁ
బోవుటయే కరమ్మునకుసొమ్ము।
చానలకుచితమౌ సంగీతవిద్యయే
పోలుపారఁగాఁ గంఠమునకుసొమ్ము।
అత్తమామలయెడ నధినాథునెడ
నమ్రతమెలంగి యుంట యౌతలకుసొమ్ము।

గీ॥ చెలఁగుసత్కథల్ వినుటయేచెవులసొమ్ము।
ఎట్టిస్థితినేని సత్కాలమేనిఁదనకుఁ।
గీర్తినొడఁగూర్చి నాథునికిఁయశంబు।
నించుమానంబు సొమ్ములమించుసొమ్ము॥

అయినదా?

సుమ. అయినది.

వన. గురుమూర్తీ! అన్ని తొడవులకంటె మంగళసూత్రము పెద్ద తొడవని మాయమ్మ నుడివియుండెనే!

అన. అవును. అదియే మొదటి సొమ్ము. తక్కినవి కడుమయొడిమెలు

సుమ. ఉపాధ్యాయీ! పతి—రూప—

అన. ఎఱింగితిని. నేనును చెప్పఁదలచియుంటిని. తనకాంతుఁడు రూపవంతుఁడు గాకుండిన నిట్లు సమాధానము బొందవలె. మామిడిపండు సుందరముగా నుండును. ద్రాక్షపండు నల్లగా నుండును. అయిన నారెంటియందు రసమున్నది. రుచి యున్నది భేదమేమియు లేదు. అదేరీతి మగఁడెట్టి రూపుఁగల వాఁడయినను ప్రేమమే ముఖ్యమైనది. దానికేరూపమును లేదు. అది సర్వతేజోధికము. తెలిసెనా?

సుమ. తెలిసెను.

అన. నీకెట్టి ఫలమిష్టము,

సుమ. నాకు మావియందిష్టము.

అన. నీకు?

కాత్యా. నాకరఁటిపండు.

అన. నీకు?

ప్రేమ. నాకు పనసపండు.

అన. నీవు?

ప్రభా. నారింజపండు.

వన. నావు నేరేడుపండు.

ప్రేమ. వనలతా? నీవు నేరేడుపండువలె నల్లనిమగఁడు వచ్చునులెమ్ము

వన. నీకుఁ బనసపండువలె ముండ్లు మగఁడు రాకుండునా?

అన. అక్కలారా! జగడమాడకుఁడు. అందఱికిని మంచి పెని మిటులే వత్తురు లెండు. ఈదినమింకఁజాలు. మీరు పతి వ్రతా చరిత్రమును, ఆరోగ్య మంజరిని చదువుకొనిరండు. నేను దాడిమీ ఫలముల నిచ్చెదరండు. (నిష్క్రి)

పిల్లలు. దానిమ్మ, దానిమ్మ, పదమ్మా, పదమ్మా. (నిష్క్రమణ)



ద్వితీయాంకము — ప్రథమరంగము.

సత్యలోకము, సరస్వతి, బృహస్పతి, కశ్యపుఁడు,
శుక్రుఁడు, తుంబురుఁడు.

బృహ. శారదాదేవీ! నాయభిప్రాయము సంగీతముకంటె సాహి త్యమే శ్రేష్ఠమని. కశ్యప మునీంద్ర! మీరేమందురు?

కశ్య. ఔను.

తుం. భారతీదేవీ! నాయభిప్రాయ మదికాదు. సంగీతమే శ్రేష్ఠ మయినది బృహస్పతులువారు ప్రమాద పడుచున్నారు.

సర. శుక్రాచార్యులు వారూరకున్నారేమి!

శుక్ర. వాణీ! బృహస్పతులతో వాదించుట నాకిష్టమైనను బల్కినఁ దగవగునని దిగులగుచున్నది.

సర. ఏల? మీయభిప్రాయ మిచ్చుటకేమి?

శు[క్రా. నేను స్పష్టముగా తుంబురులువారి వాక్యము నామోదించు వాడఁనే.

ప్రవేశము ద్వారపాలకుఁడు.

దేవీ! నారదులువారు దర్శనార్థ మనుజ్ఞ వేడుచున్నారు.

సర. అవశ్యము, ప్రవేశపెట్టుము. (ద్వార. నిష్క్రమణ)
నారదమహర్షి మంచిసమయముననే వచ్చెను.

తుం. వారుమాతో నేకీభవించువారే.

ప్రవేశము నారదుఁడు.

క॥ సారదధిమరాళశర।
స్నీరదసితపంకరుహా ఫణివిభూషసుధా।
పారదనిభధవళాంగీ।
శారదనీగొలుతేనమ్మ స్వాంతమునందున్॥

క॥ చేరితినీపదసన్నిధిఁ।
గోరితినీనిండుకరుణ గురుదైవతనే॥
వారతి, వాక్పారతియును।
భారతినాకొసఁగి కావలయుందల్లీ॥

మహానుభావులారా! నమస్కృతులు.

సభ. మహర్షితిలక! నమస్కారములు.

సర. మునివర్య! మంగళమగుగాక! ఎచ్చటనుండిరాక? చాల దినములాయె మిమ్ముఁగనుఁగొనక.

నార. తల్లీ! భూలోకమునుండి నేఁడే వచ్చితిని.

సర. ఇప్పుడు పండిత సభయందు సాహిత్య మహిమనుగూర్చియు సంగీత మహిమను గుఱించియుఁ బ్రసంగము జరుగుచున్నది. మీరు సకాలముననే వచ్చితిరి.

నార. దేవీ ! వానిమహాత్వ్యముల నిపుడు మఱచియున్నాను. పతి
వ్రతా మహిమ నెఱింగి వచ్చినాను.

బృహ. (ఈయన యేదియో ప్రారంభముఁజేసె)

కశ్య. (విందము ఊరకుండుఁడు.)

పర. ఇంతకు మునుపు తెలిసికొని యుండలేదా ? ఈలోకమున
కంటె మనుజ లోకమున నెక్కువ తెలిసెనా ?

నార. ఔను.

తుం. (శుక్రునితో —) ఏమో బీజము నాటుచున్నాడు.

శుక్ర. (ఇంతలోనే మొలక యెత్తును. చూతము)

సర. అయిన నంతటి వారెవరు ?

నార. ఆ॥ వె॥ అలరుఁగాదె ధాత్రియందత్రిమునిజాయ ।
భవ్యనామధేయ, పతివిధేయ ।
అతిథిభాగధేయ, నుతగుణసముదాయ ॥
శ్రీయుతానసూయ, శిష్టగేయ ॥

సర. ఔను. పతివ్రతయని విన్నాము,

నార. అంతమాత్రమేనా ? పతివ్రతామణియని తప్పక చెప్ప నొప్పు

సర. అంత పొగడ్తయేమి ?

నార. గుణాతిశయమును గొండాడవలదా ?

సర. ఎట్టి యతిశయమును గ్రహించితిరి ?

నార. వివరించెదను.

ద్వి. మగనిరూపంబు మన్మథవిలాసంబు ।
మగనిజీవనము రమావైభవంబు ।
మగనిపల్కులు నిగమముల వాక్యములు ।
మగనిపాదంబులు మస్తకమణులు ।
మగనిసేవయే యుత్తమవ్రతంబనుచు ।
మిగులమదిఁదలంచి మెలఁగునామగువ ॥

సర. ఆహా! సాధ్వీమణియే!

బృహ. సందేహమేమి? పతిజేసిన సుకృతమే.

నార. అంతేకాదు. ఆమె పాదధూళి వ్యాపించిన నేలయంతయు వైరి మృగముల కొద్దిక పరువుగానున్నది. అతిథులను దేవతలనువలెఁ బూజించి వారెట్టివి కోరినను నాశ్చర్యముగాఁ దెచ్చియిచ్చి తృప్తులఁగావించును.

సర. మీరెట్లు చూచితిరి?

కశ్య. (బృహస్పతితో—ఎదియో పరీక్షచేసి వచ్చినాఁడు)

నార అరణ్యమునఁ జిక్కనట్టి యావుపాల నొక కడవెడు రుద్రాభిషేకమునకుఁ గావలెనని కోరగా తనగోవును గామధేనువు నొనర్చి యబ్బురంబుగా క్షీరములఁ బిదికియిచ్చె. ఆమహిమ నేమనంగవలను?

సర, ఆహా! మహాత్మయే.

శుక్ర. పొగడఁ దగినదియే.

నార. నేనామె సెలవుపొంది వచ్చునపుడు "దేవ! నీకెట్లు విజ్ఞప్తిఁ చేయుమనినది.

సర. వినఁగోరెదను.

నార. ఏమన,

ఆ॥ నీదునింధుకరుణ నెగడెడునీపుత్రు।
లోకనిమాట నొక్కడొప్పకుండ।
వాదులాడుచుంద్రు వారలకైకమ।
త్యంబుఁగూర్చి కావుమమ్మవాణి॥

అని విన్నవించినది.

కశ్య. (స్వ॥ సత్యమే, ఇంతవఱకదియే యయినది.)

శుం. నిశ్చయమే, బాగుగ చెప్పినది.

సర. ఏమి ! ఇదివిజ్ఞాపనమా ! అజ్ఞాపనమా ! నాపుత్రులవివేకులా ? ఒకరితో నొకరు పోట్లాడుదురనియా ? వారికి నేనొద్దికఁ గూర్పవలెననియా ? ఇది నాకు బోధించుటయా ? మంచి జ్ఞానవతియే ?

బృహ. దేవీ ! అలుకయేల ? ఆపెవి విన్నదనంపుఁ బలుకలేకద !

సర. ధిషణా ! ఇవి విన్నదనంపుఁ బలుకులా ? పొగరుదనపు మొలకలుగావా ? వాడిగల ములుకులుగావా ? తాను మహాపతివ్రతయగుఁగాక, యీమునితిలకునితో నిట్టిచులకన పలుకులు నాపైఁ బలికెనా ? తనకంతమాత్రము జ్ఞానము నెవరొసంగిరి ? తెలివి తేటల నెవరిచ్చిరి ? ఎఱుఁగవలదా ? నాదయ లేకుండిన తాను మూఁగయై బ్రతికి యుండదా ? యోచింపవలదా ? ఇదియేనా నాకుఁబ్రతిగౌరవ మొసఁగుట ?

నార. ఆసందేశ వాక్యముఁ జెప్పినపుడే గుఱించితిని. కొంచము గర్వలక్షణ మున్నట్టున్నది.

కశ్య. (బృహస్పతితో — దేవేరికిఁ గిదుకబుట్టె. ఇతరెక్కువ చేయుచున్నాడు. శాంతింపఁజేయుఁడు.)

బృహ. (కొంచము తాళుఁడు)

సర. "ఉన్నట్టు" అననేల ? ఉండియేయున్నది. నిండియేయున్నది కావుననే బయటికిఁ బొడసూపినది. అది యెంత యున్నదో నేను జూచెదగాక ! తనపాతివ్రత్యతనేను పరీక్షించెదఁగాక !

శుక్ర. వాగీశ్వరీ ! శాంతింపుము. శాంతింపుము.

సర. మూఁడు కన్నులవాఁడు చెప్పినను వినను. ఇప్పటికి సభావిరామము నొసఁగుచున్నాను. తామెల్లరు దయచేసి సెలవుఁ గైకొనవచ్చును. (నిష్క్రమించును)

శుక్ర. అయ్యో, గ్రహచారమా! ఏమియో సమాధానము జెప్ప బోగా నొంటి కంటి వాఁడనని యనిపించుకొంటి. ఇదియే ఫలితము.

బృహ. (నారదునితో) మునీంద్ర! మంచిసందేశమును దెచ్చినారే!

శక్ర. వాఁరికిట్టివే లటస్థ పడుచుండును.

నార. ఇదియింకను బ్రథమరంగము. ఇంక రెండు రంగములు—

తుం. నాటకమేకలదా, యేమి?

నార. చూడఁగలరు నేనేల జెప్పవలె!

ప్రవేశము పరిచారకుఁడు.

మహర్షులారా! మధ్యాహ్నమైనది, పులస్త్యులువారు తమ రాకకై కాచియున్నారు. ఇదెవిజ్ఞప్తి.

శక్ర. ఇదే వచ్చుచున్నాము. సభ్యులారా! రండు (నిష్క్రమణ)



ద్వితీయాంకము — ద్వితీయరంగము.

వైకుంఠము, లక్ష్మీదేవి, అదితి, శచి, శ్యామల.రతి, రంభాదులు.

రంభ॥ బంధుర॥

కలువులఁగనుదయునొసగెదుకలికీ!, కొంచెవేసికడఁగంటనన్నుఁ!
గాలిచెదనసుగుల నడపక యొడదఁ గూలఁగద్రోయువవేమిడి, నీ।
పలిగినఁబుడమిన్నిబదుకులుగలవే, యక్కటికంబునుమానవుమా।
యులయలవిలుతునిగనిపడతి! మాయమ్మరో! వెన్నునియన్నుఁచెలీ॥

లక్ష్మి. రంభా! మీపాట మనికింపు, చెవికి సొంపు, సంతసమునింపు మీకిఁక సెలవు.

రంభాదులు. భాగ్యము. (నిష్క్రమింతురు)

లక్ష్మి. అదితీదేవీ! వీరిపాటను గురించి వివాతలంపేమి?

అది. ఇందిరాదేవీ! నిన్నుఁగూర్చిన పాటలే సొంపు.

లక్ష్మి. శచీదేవీ! నీవేమందువు?

శచి. ఈఅప్సరసల రూపములకు, వానిని మించిన పాటలకు బంగారు ముద్దలు సొమ్ములుగా మారినట్లు సందియమేమి? వీరి సభ చేసినప్పుడు నానాథుఁడు వైశమలేచి వచ్చుటయే యరుదు.

లక్ష్మి. శ్యామలాదేవీ! నీయభిప్రాయమేమి?

శ్యా. కమలాదేవీ! నాలోకమున నీపాటలవిను కలిమే తక్కువ. రేయింబగళ్ళు నీపాపికీనరకము, ఇట్టిపాపికిట్టి నరకమని చదువుటలు, ఆనరకములకుఁ బోవువారు నానాథుని దూషించుటలు. వినివిని నాచెవులు మొద్దులయినవి.

లక్ష్మి. ఏమి! పుణ్యాత్ములు వచ్చుటయేలేదా?

శ్యా. ఎక్కడ నున్నారు? ఎవరో నూటికొకరు వచ్చుచున్నారు. నిన్నమాత్రము సావిత్రియట, మద్రదేశాధీశుని పుత్రియట, యొక పతివ్రతామణిని నావిభుడు స్వయముగాఁ బిలిచికొని వచ్చి నాకు దర్శన మిప్పించె. భూమియందట్టి పతివ్రత లున్నారాయని సంతోషించితి.

శచీ. ఆమె చరిత మెట్టిది?

శ్యా. ఎమనగా. సంగ్రహముగాఁ జెప్పెదను. ఆసతీమణి,

సీ. కాంచి మోహించి వరించినహృదయేశుఁ
దల్పాయువగుట సత్యముగ నెఱిఁగి।
రాజ్యహీనుఁడు భాగ్యరహితుఁడన్నాటయుఁ
జెవులారవిని, మదిచెదరకుండ।
సత్యయమూమయు సంధులంచు నెఱింగి।
కష్టసేవయటంచుఁ గాంచకుండ।
వతని నే పెండ్లాడి యనురాగమునఁగొల్చి
యురనిముసమును బాయక చరించి॥

ఆ॥ వె॥ విగతజీవుఁడగుచుఁ, పితృపతి వెన్నంటి ।
యతని మోసగించి చతురమతిని ।
వరముఁబడసి మగనిఁ బ్రదికించుకొనినదా
[illegible] వెలదిగలదె ॥

ఆది. ఆహా ! ఎంతటి సుచరిత్ర ! ఎట్టిదిట్టమానిసి !

ప్రవేశము ద్వారపాలకుఁడు

దేవి ! పరాకు ! నారదమహర్షులు దర్శనము గోరుచున్నారు.

లక్ష్మి. నిరాటంకముగా రమ్మనుము. (ద్వా॥ నిష్క్రమణ)

ప్రవేశము. నారదుఁడు.

భు॥ ప్ర॥ రమానాథ ! గోవింద ! రాజీవనేత్రా !
క్షమాధీశ ! వైకుంఠ ! కారుణ్యమూర్తీ !
క్షమింపందగుఁ నేనుగావించుబల్ పా ।
పముల్ భక్తపక్షా ! విపన్నాళిరక్షా ॥

లక్ష్మి మహర్షి చంద్రులకు నమస్కారములు.

నార కల్యాణమస్తు.

లక్ష్మి. ఇచటఁ గూర్చుండుఁడు.

నార. (ఆసీనుఁడై) పద్మాదేవి ! పద్మనాభుఁడు నగరమున లేఁడా ?

లక్ష్మి. లేరు. ఏభజన మందిరములలో, యేవ్రతముల సల్పువారి యిండ్లలో, యేసజ్జనుల రక్షించుటలో పోయియుందురు ఇట నుండుటయే యరుదు. మీరెచ్చటనుండి విచ్చేసితిరి ?

నార. భూలోకమునుండి.

లక్ష్మి మనుజలోకమున సావిత్రియట, యొకసాధ్వీమణి, యామె చరిత్రమును మీరెఱుఁగుదురా ? శ్యామలాదేవి మాకిపుడు విన్పించె

నార. ఔనౌను. అత్రిభార్యగదా ! గొప్ప పతివ్రత. నేను జూచియే
వచ్చినాను.

అది. ఋషివర్య ! కాదు, కాదు. సత్యవంతుని యిల్లాలు సావిత్రి.

నార. ఆహా ! ద్యుమత్సేనుని కోడలా ? నిజమే, మగువలం బొగడం
దగినది. తనమగనిం బ్రదికించుకొన్నదిట్ట.

రతి. మీరన్నది యెవరిని గుఱించి ?

నార. అత్రిమహర్షి పత్నియగు ననసూయనుగూర్చి.

శచీ. ఆమె కథ యేమి ముచ్చటించెదరా ?

నార. అమ్మా ! ఏం తేని యున్నది. నాలుగుమాటలలోం జెప్పెదను

హారిగతి॥ ర॥

పతితపమునకుం బోయినదినములు, పడతికినుపవాసవ్రతదినముల్ ।
పతిపాదకమలసేవావిధములు, భామదలంచెనుబహువిధధనముల్ ।
సతతమునింటికివచ్చెడునతిథుల నాత్మాద్దైవతములుగా నెంచుఁ ।
హితమతిపడుచులకనువగువిద్దెను నెడపక బోధించుచుఁబోషించుఁ ॥

ఇంతేకాక యాయనసూయ సత్యభాషణప్రియ, సదాచార
మేయ. శాంతిగుణాతిశయ, సార్థకనామధేయ. నేనొక దిన
మున నామె సపర్యలనంది వచ్చితిని. ఆమె గుణావళి నేవర్ణిం
పంజాల. ఆమ్ముగువల మిన్నదలంచినంత మాత్రమ్మునం దుమ్మును
నిమ్ముంజేయును, గోపించినయెడల నిమ్మును దుమ్మునొనర్చును.
ఆమహిమ నేమనగలను !

అది ఆహా ! ఎన్నందగినదియే !

లక్ష్మి. మమ్ముల నెంచుచుందునా ?

నార. (స్వ॥ నాథుడియాలు సమీపించె) కమలాదేవీ ! నిన్ను స్మరిం
పనివారును, నారాయణుని దలంపనివారు నుందురా ? నేను

వచ్చునపుడా సతీమణి సీతో నిట్లు విన్నవింపుమనికూడఁ జెప్పి నది. వినుము.

రతి ఓహో! ఏమో సందేశమున్నట్లున్న దే?

నార. ఏమనగా,

ఆ॥ వె॥ నూటికొకనిదయఁ గనుంగొనుచుండెద!
వల్లెయగునుగాక, యట్టిసుతుఁడు।
త్యాగిగాను. ధర్మదాక్షిణ్యపరుఁడుగా।
నలరునట్లు సేయుమమ్మపద్మ॥

అనివిజ్ఞాపించినది

లక్ష్మి. ఆమానిని బంపిన విజ్ఞప్తి యాయిది?

అది. సమంజసముగానున్నది.

శ్యా. అనుభవముఁ గలదిగా నెఱుఁగఁబడుచున్నది.

రతీ. దేవేరులారా! మీ రమాయకురాండ్రు. సందేశమునందు శ్లేషార్థమున్నది. ఆమెయొక్క విద్యాగర్వమును జూపించినది.

నార. (నాకుగొంచము తోఁచు దొరకె) రతీదేవి మఱేమియో యర్థమును గ్రహించునట్లున్న దే!

లక్ష్మి. అది కుశలమతి, గ్రహింపకుండునా! నేవివరించెద, వినుఁడు. నూటికొకని దయఁ జూచెదననగాఁ దక్కినవారినట్లు చూడ ననికదా! నాకృపఁ గల్గిన వానిని దానపరునిగా, ధర్మదాక్షిణ్యవంతుఁడుగా నుండునని కదా భావము. తాను నాకు బుద్ధి నేర్పుటయా? నాదయఁ గల్గినవారు త్యాగులుగారా? వారుగాకున్న జోగులేమి త్యాగము సేయఁగలరు? నాపుత్త్రుఁ డొక్కనివలనఁ బెక్కురు జీవించుచుండుట లేదా? బెల్లము నీఁగలువలె ముసరి యట్టివానిని నమయఁ జేయకున్నారా?

నూటికొకనియుని తాను వధరుటయేల ? ఎవఁడు నాదయుకుఁ పాత్రుఁడో యట్టివానికి దయఁ జూపుచుండుము. అట్టివాఁడు ధర్మదాక్షిణ్యపరుఁడుగా లేఁడనినచో తనవంటి నిర్భాగ్యపు మానిసి వట్టిచేతులతో నెట్టి ఘనకార్యమైనను జేయఁబడినదా ? చేయఁబడుచున్నదా ? చేయఁబడునా ?

నార. రామ ! రామ ! నీకృపలేనిదే జీవింపఁనగునా ?

లక్ష్మి. తుదకు నిలువ నీడఁ గట్టుకొనుటకు నాదయ వలదా ! కట్టుకొను పుట్టముఁ దెచ్చుకొనుటకు నాదయలేక సాధ్యమా ? చివరకుఁ దిండిగింజల సేకరించుకొనుట నాదయవలనఁగాక మఱిదేనివలన ? ఈయర్థముల నామె గ్రహింపలేదు కాఁబోలు ! నేను ఎలకనగాఁ దోఁచితిఁ గాఁబోలు ! నన్ను సామాన్యరమణిగా నెంచెఁ గాఁబోలు ! తన విద్యాగర్వమిట్లాడించినది. పతివ్రతనను దంభమిట్లు పల్కఁజేసినది.

నార. ఈభాగమున నాకును గొంచెమనుమానమే.

రతి. అనుమానమేల ? నిస్సంశయముగాన హంకారమే. మర్త్యలోకముననుండు తానెడ ? స్వర్గలోకముననుండు మహాలక్ష్మియెక్కడ ? ఈమెను దాను దిద్దునదియా ?

శచీ. రతీ ! నీవూరకుండుము. కోపము హెచ్చుఁ జేయుచున్నావే. ఇందిరాదేవీ ! నిమ్మళించుము. నిమ్మళించుము. ఆయన సూయ పంపినది వినయపూర్వక ప్రార్థనమే. అందులకు వికటార్థముఁ జేసికొనవేల ?

లక్ష్మి. ఇంద్రాణి ! వికటార్థమేల ? ప్రకటార్థముగానే యున్నది. నాదయ నిరర్థకమని సమర్థించినట్లున్నది. నేనంతటి పలుచఁదనమా ! తనకుఁ గన్నులు గానరావా ! బుద్ధి పురుగుమేసెనా ? ఈగర్వమును దొలఁగించి తీరెదను. ఋషితిలక !

నాకిటనిల్వ మనసొప్పదు. సెలవియ్యవలెను. దేవులారా! క్షమింపుఁడు. సెలవుఁ గైకొనుచున్నాను. (నిష్క్రమణ)

అది. మునీంద్రా! మీరువచ్చిన ముహూర్తము బాగున్నట్టులేదే?

నార. అమ్మా! నేనెచ్చటికిఁ బోయినను గలహ ముహూర్తములే సంభవించును. నేనేమి సేయుదు. సాధారణముగా సందేశ వార్తఁ జెప్పితిని.

శ్యా. ఆనారీమణిపై రమాదేవికిఁ గోపము గలిగనే. నాకు భయమగుచున్నది

నార. ఔనౌను, రమాదేవి కేమగునో—కాదు—కాదు—అన సూయ కేమగునోయని నాకును భీతి బొడముచున్నది. ఇప్పుడేపోయి లక్ష్మీదేవిని వేఁడుకొనెదను. ఇదె సెలవుఁ బుచ్చుకొనుచున్నాను. (నిష్క్రమణ)

శచీ. రతీ! నీయత్తగారియందలి యభిమానముచే నామె కెత్తిన కోపము నెక్కువఁ జేసితివే. చాలు, పోదము రమ్ము.

రతీ. నారదుఁడు దెచ్చినదికదా, నేనేమి జేసితిని?

శ్యా. అతఁడుదెచ్చి యుంటించె. నీవూది రగిల్చితివి. ఇంకేమి కావలెను.

శచీ (అదితినిఁజూచి) అత్తగారు! పోవమురండు. మీరైనను మరల లక్ష్మీదేవిని శమింపఁజేయుఁడు. మేమున్బ్రార్థించెదము.

అది. మంచిది. రండు (అందఱు నిష్క్రమింతురు)

## ద్వితీయాంకము — తృతీయరంగము.

కైలాసము. పార్వతి. లక్ష్మి. సరస్వతి.

లక్ష్మి. పార్వతీదేవీ! చూడుము ఆయనసూయ కెంత గర్వమో! నాయందు లక్ష్యములేకపోయె. సరస్వతియెడ మర్యాద లేకపోయె.

గీ॥ సకలసంపదలనొసంగఁ జాలునన్ను।
సర్వవిద్యలనిచ్చు నీశారదాంబ।
గడఁగిదూషించినట్టి యాకాంతయొద్దలఁ।
దిట్టకుండునె? కనుమెంతదిట్టతనమొ॥

పార్వ. రమావాణులారా! అసందేహముకూడ లేదు. మీరు చెప్పిన పల్కులలో మీయనుగ్రహమును గలిగిన వారల దూషించినట్టున్నది. ఆమె నన్నే తిట్టినది.

సర. ఔరా! పరమేశ్వరివగు నిన్ను నయితమా! మువ్వురిని విను వలెదే! ఆసతి యెక్కుడు పతివ్రతయని నారదుఁడు వక్కాణించె. ఆయహంకార మేచటికిఁ బోవును? సర్వసౌభాగ్య దాయినివగు నిన్నెటులెంచఁగలిగె?

పార్వ. నాకరుణాతిశయమున వర్ధిల్లు స్త్రీజనములు చండికలుగా నుండునటులు పతులను నగముచేసి పిల్చిలైవనుండ నేను చేయవలెనట. ఇది విన్నదనంబున డికారమో, తృణీకారమో చూడుము.

లక్ష్మి. నిస్సంశయముగాఁ దృణీకారమే.

పార్వ. కావుననే యామదవతి మదము నణప నాహృదయేశుని దక్షిణము పంపనెంచినాను.

లక్ష్మి. నేనును నానాథుని బంపెదను. నీమాట పొంబుఁడు తక్షణ

మంగీకరించును. నాపల్కుఁ గమలాక్షుఁడు త్వరగా సమ్మతింపడు. అయినను బ్రార్థించెదను.

సర. మీయిరువురుకంటె నాది కష్టకార్యము. నావిభునికి సృష్టికార్యములలో విరామమే లేదు. అందుకుఁ దోడుగా వేదఘూర్ణులు. ఎక్కువ శాంతము. మిక్కిలి ఛాందసము. ఒక మాటకు నాలుగు మాటలు బదులు చెప్పుచుందురు. అయినను సాహసించెదను. ఈలోపలనే నొక తంత్రము బన్నియున్నాను. మనకుఁగూడ దుస్సాధ్యమైనది మీరామోదించిన యెడల నాయనసూయపై నొడ్డెదను.

పార్వ. సంతోషము. ఏమిచెప్పుము ?

సర. ఇదిగో ! విశ్వకర్మచే నుక్కునగలఁ జేయించుకొని తెచ్చినాను. వీనిని సుగ్గళ్ళుఁ జేసియిమ్మని కోరి యాసతి నగడు పఱచవలెను.

లక్ష్మి. సెబాస్ ! నీవు విద్యావతివి గనుక నుంచియుక్తిఁ గనిపెట్టినావు.

పార్వ. సరియే; యీశనగలఁ గొనిపోయి పక్వముచేసి యిమ్మని కోరువారెవరు ?

సర. ఆనారదునే పంపుదము.

లక్ష్మి. సరే, బాగున్నది.

పార్వ. అయిన, నేనతనిని బిలిపించెదను.
భృంగీ !

ప్రవేశము. భృంగి.

దేవీ ! ఆజ్ఞ ?

పార్వ. నారద మహర్షిని దయచేసి రమ్మనుము.

భృం. చిత్తము. (నిష్క్రమణ)

ప్రవేశము. నారదుఁడు.

(సరసిజము.)

శ్రీగౌరీదేవీ ! దయనుకంపాంచితమతి మన్మథవైరితోఁలనుసతమున్ ।
శ్రీగోవిందప్రేయసి ! పద్మా ! సిరులనొసఁగి మునిచెదవనితలతున్ ।
వాగీశప్రాణేశ్వరీ వాణీ । పలుకులుసరసత ఁరగఁగనియవే ।
రోగంబేమోనేనెఱుఁగన్ మిమ్ముకటనిచటసితినొనరుపఁగలిగెన్ ॥

పార్వ. మునిచంద్రా ! నమస్కారములు. ఈయాసన మలంకరింపవలె

నార. (కూర్చుండి) అంబా ! ఏమియానతి ?

పార్వ. మేము మువ్వురమొక కార్యమునకై మిమ్ముఁ బంపనెంచి యున్నాము. దయచేసి పోయిరావలయు.

నార. దేవీ ! త్రిమూర్తుల దేవేరులగు మీరు నన్నింత ప్రార్థింప వలెనా ! నిరభ్యంతరముగా నెట్టికార్యమైనను గావించెదను. సెలవిండు.

లక్ష్మి. ఏమన, భూలోకమునకేగి యత్రిభార్యచే నీయుక్కునగల నడిగికొంచుకొని తేవలయు. ఇదియే మాప్రార్థన.

సర. అర్ధభాగముడిగినఁ జాలు. తక్కిన భాగమట్లే యుండినఁ నుండుఁగాక.

నార. (స్వ॥ అరరే ! వీరనుసూయ గూడియా యనసూయపై దం డెత్తి నెంచియున్నారు. ఈయినుప నగలను రాయబార ముగాఁ బంపనెంచినారు. ఆసతీమణిపై వీరికిఁగలిగిన కోపాగ్ని నీనగలచే నింకను బ్రజ్వలింపఁ జేసెదను.)

దేవేరులారా ! ప్రతి భాషణమని యెంచక నావిన్నప మాలించెదరా ?

సీ॥ ఆయనసూయపైమీయుల్కలు
చలంబులేల నీయెత్తులుఃపోలవమ్మ ।
మానవమాత్ర యామానినికిఁ
మీకునెచ్చటసాటి యూహింపరమ్మ ।
ఒక వేళనామెయందొప్పుమిగల్గిన
మన్నింపఁగామీకుమాన్యమ్మ ।
మీరుకోపముబూనమేదిని
నెవ్వారలడ్డము నిల్వసమర్థులమ్మ ॥

ఆ॥ ఉక్కళనగలేమి ! యుడికించులేమి ! యే ।
యింతిచేతనగులె ! యిట్లుపంపి ।
యాపడంతి మీరలవమానపఱచుట ।
తరముగాదు, దొడ్డతనముగాదు ॥

పార్వ. మునీంద్ర ! ఆసతియెడ మాకుఁ గోపమగ్గలమే. ఆనారీ రత్నము పంపినవాక్యముల శ్రద్ధగా మాకుఁదెచ్చి విన్పించితిరే ; మేముపంపు కార్యముసకాపెకడకుఁ బోవుటకు మీ కిష్టములేదా ?

లక్ష్మీ. అందుచేతనే యేమేమియో యూయుమ పత్రమునఁ జదువుచున్నారు.

సర. పోనిండు.. వారికిష్టములేనియెడల —

నార. జగన్మాతలారా ! నాపైనేల కినుక. నాకు మీరెక్కగాని యితరులగుదురా ? అవశ్యము, ఈక్షణమే పోయెదను. ఇదే మోసాధ్యముకానిపని. మీయాజ్ఞానుసారము పోయివచ్చుటకు నాకుఁ గష్టమా ? ఇదెసెలవుఁ గైకొనుచున్నాను

పార్వ. చిత్తము. పోయిరండు.

నార. (మీఁకుముద్దర నైవేద్యము దెచ్చెద తాళుఁడు ) (నిష్క్రి)

పార్వ. సరస్వతీ ! నీయుక్తి బాగున్నది నారదుఁడు గుగ్గిళ్లనుదెచ్చునా?

సర. ఎప్పటికైనను సాధ్యమా ? అగ్నికిఁ దరముగాదు. అటివ కగునా ?

లక్ష్మీ. మనకార్యము జయమే. సందేహములేదు.

పార్వ. చూతము. పర్వతాగ్రమునకుఁ బోదము రండు, చల్లగా నుండును. (నిష్క్రమింతురు)



## ద్వితీయాంకము — చతుర్థరంగము.

### ప్రవేశము. నారదుఁడు.

(స్వ॥) ఆహా ! ఉమారమా వాణులనసూయపై చలము పట్టి యున్నారు. అనసూయా సందేశ కారణములచే నా కలహ బీజము బాగుగా వేరంటి చిగిరించినది. అయిన " నయ్యావారి జన్నిద మయ్యావారికే ముప్పు " అన్నట్లు వీరు ముగ్గురు నాకేశ్రమగలుగఁ జేసియున్నారు. ఈయుక్క శనగల నెక్కడనో నిర్మాణముచేసితెచ్చి యాయనసూయ చేత నుడికించుకొని రమ్మని నాకుఁ బనిపెట్టియున్నారు. ఇందులో సరస్వతి యుక్తికి మేరయేలేదు. ఉగింజలు సగముడికినఁ చాలునని పల్కినది. అనగా వీని నెక్కడనైన నేను బాలవైచి నిజమైన శనగలఁ బక్వము చేయించుకొని తెత్తునేమోయని యనుమానము. సగము గుగ్గిళ్ల రూపము సగ ముక్క రూపముండిన యెడలఁ దమపరీక్ష కనుకూలమని యెంచియుండవచ్చును. చింతలేదు. ఇదినాకింక ననుకూలమే.

ఆ పతివ్రతామణి, యుక్కాగాదు వజ్రమునైనను నీరుచేసి యిమ్మనిన నియ్యఁగలదు, నాకు నమ్మకమే. ఈతంత్రము వలన నీమూఁగురమ్మగారామె నవమాన పఱుపఁ దలంచినారు. బిర్రున దాటఁబోయి పర్రున జాటినట్లు తామే యవమాన మొందుదురు. ఇదియు నాకు దృఢమే, నాకార్యమునకు బలకరమే. అయిన నొక చిక్కుమాత్రము సంభవించినది ఆసతీమణి క్రియుక్కు శనగలెట్లు చూపుదు? వీనిని పక్వము చేసియిమ్మని యెట్లడుగుదును. హాస్యమని యెంచి నన్ను శపించిన నేమిసేయఁగలను? దీనికి సరియైన కారణము చెప్పక తప్పదు. ఏమి యోచింతును? (ఆలోచన నభినయించి) ఒక విధము తోఁచుచున్నది. అదితప్ప యొందుపాయము కన్పట్టకున్నది చూచెదఁగాక! (నిష్క్రమించును)



తృతీయాంకము — ప్రథమరంగము.

భూలోకము, అత్రిపర్ణశాల, అనసూయ, అంబిక.

అం. అనసూయాదేవీ! బాల్యమునందుఁ దండ్రియధీనములోను, వివాహమైన పిమ్మటఁ బతియానతిలోను, బుత్రులఁ గనిన తర్వాత వారివశము నందును స్త్రీలు మెలఁగవలెనని చెప్పితివే! స్త్రీలకు స్వతంత్రతయే లేదా?

అన. ఏల లేదు! ఏవనితకుఁ దనయిల్లు వాసిఁగాంచునటులు గృహకార్యముల సముచితముగ నెరవేర్చుకొనుటకు స్వతంత్రమే. ఎట్టి సత్కార్యములఁ జేయుటకు స్వతంత్రమే. పతికార్యములఁ దోడ్పడుటకును స్వతంత్రము కలదు. అయిన నాయాకార్యములలో నాథునాజ్ఞఁ బొందుట ధర్మము. లేకున్న

నతని చిత్తమున కెక్కు కార్యమును స్వతంత్రముగాఁ జేసినను దప్పుగాదు. పతికిష్టములేని సత్కార్యమైనను గావించుట దోషమే. అది సతీ ధర్మము కాదు. అట్టిస్వాతంత్ర్య మను చితము, తన గౌరవమునకు హానిలేనట్టియు, తన గృహమున కపకీర్తిఁ దేనట్టియు నెట్టిపనులనైన స్వతంత్రముతో సలుప వచ్చును.

ప్రవేశము. సనందుఁడు.

అనసూయాదేవీ! నారద మహర్షి వచ్చుచున్నాడు.

అన. నారదులా! కృష్ణాజినముఁదెచ్చి పరుచుము.

ప్రవేశము. నారదుఁడు.

పం॥ చా॥ వినీలనీరదాభకాయ! విశ్వభద్ర దాయకా!
మునీంద్రలోకవందనీయ! భూతనాథసాయకా!
మనంబునిత్యముగ్ద్వదీయమంజుపాదపద్మ చిం।
తనంబొనర్చునట్లుసేయు, తండ్రి! వేడెదన్నినున్ ॥

అన. మునీశ్వరా! అభివాదనములు. (అందఱునమస్కరింతురు)

నార. దీర్ఘాయుష్యమస్తు.

అన. మీకు క్షేమమేకద?

నార. అమ్మా! నా క్షేమమునకుఁ గొంచెము క్షామము చుట్టుకొనినది.

అన. అయ్యో! అది యెట్లు?

నార. మూఁడు దినములనుండి దారుణము సంభవించినది. రెండడుగులు నడవఁ జాలని బలహీనము కలిగినది.

అం. దేవమునులగు మీకుఁ గూడనా?

నార. తల్లీ ! పంచభూతాత్మక శరీరము లెవ్వియైననేమి ? " ఇదం శరీరం శతశసంధి జర్ఝరం " అని యెన్నియో వ్యాధులు. మాలోకమున సహితము ధన్వంతరియను వైద్యుడుంట మీా రెఱుఁగరా ?

అన. అతనియొద్ద నేమైన నౌషధముం గొనరైతిరే ?

నార. అతఁడిచ్చిన మందును సేవించుటకే యిచటికి వచ్చినాను.

అన. స్వామీా ! అదెట్టి యౌషధ క్రియ ? నావలననగునా ? దయ చేసి చెప్పుఁడు.

నార. ఇవిగో నీయుక్కుశనగలను దోసెడిచ్చియున్నాఁడు. వీనిని గుగ్గుళ్లగాఁ జేసికొని మూడుపూటలు భక్షించిన నాబాధ తొలఁగి తొంటికంటె బలము వచ్చునని చెప్పినాఁడు.

అం. ఋషివర్య ! ఉక్కుశనగల నెచ్చటను జూడలేదే ! ఇవి యెట్లుడుకును ? ఇదియేమి వైద్యము ?

నార. అమ్మా ! ఈప్రశ్నల నేను నా వెజ్జునడిగితిని. ఇది దేవ వైద్యము, గొప్పయిల్లాండ్ర కడకుఁబోయి చేయించుకొమ్మని చెప్పినాఁడు.

అన. మునితిలక ! దేవలోకమునందలి మహాత్మ లెవ్వరును జేసియియ్యక పోయిరే ! మీాయెడ జాలిఁజూపలేదు కాఁ బోలు. లేకున్న వాండ్ర కసాధ్యమగు పనులు కలవా ? దయచేసి యుండు. ఇప్పుడే పక్వముగావించి మీాబాధఁ బోగొట్టి పుణ్యము సంపాదించెదను.

(నారదుఁడిచ్చును. అనసూయ తీసికొని)

అంబికా ! పొయ్యి నంటించుము. నానాథుని కమండలూ దముఁ దెమ్ము. (అనిపోవుచుండగా)

నార. అమ్మా! గింజపూర్ణముగా నుడుక నక్కఱలేదట. అర్ధ భాగమే యుడుకవలెనట.

అన. చిత్తము. అట్లేచేసెదను. (నిష్క్రమణ)

నార. (స్వ! భగవంతా! గడ్డకుఁబడితి)

సనం. తాతా! దేవలోకమున బియ్యము మున్నగునవి యుక్కవేనా?

నార. ఇప్పటి మాత్రము శనగలు పుట్టినవి. ఇంకముందేమో!

సనం. సగముడికిన యుక్కగింజల నెట్లు నమలఁగలవు? పండ్లు గట్టిగనున్నవా?

నార. అయ్యా! ఈపండ్లూడిన యెడల మావైద్యుఁడు వేఱే నిర్మించి నోటికిఁ దగిలించునో యేమో?

సనం. అబ్బబ్బ! అదియుఁ గలదా!

ప్రవేశము. అనసూయాంబికలు.

అన. తపోధనోత్తమా! ఇవిగో గుగ్గిళ్లు. అర్ధభాగమే పక్వముఁ గావించి తెచ్చినాను. స్వీకరింపవలెను.

నార. అమ్మా! సంతోషమయ్యె. (అని పుచ్చుకొనును)

అన. స్వామీ! నాయాతిథ్యమునుగాని పోవఁదగు.

నార. తల్లీ! క్షమించుము. ఒడలు నెమ్మదిగాలేదు. నీయింట భుజించినట్లే యెంచుము. నాకోరినది యొసఁగితివి. పరమానందమయ్యె. నేఁబోయివచ్చెద.

అన. మీచిత్తము. దేవలోకములకుఁ బోయియుంటిరికదా! నా విజ్ఞాపముల భారతీ పద్మావతీ పార్వతులకు నివేదించితిరే?

నార. తప్పక చెప్పితిని. వారు నీయెడ పంతగించి—కాదు—సంతసించుటయేకాక మగుడ నాచే నుక్కశనగల—కాదు—

కాదు— పెక్కువరములఁ బంపితిమని చెప్పుమనిరి. దేహమునకు స్వస్థత లేకుండుటచే నొకమాటకు మఱియొకమాట వచ్చుచున్నది. ఇఁక సెలవుఁ గైకొనుచున్నాను. (నిష్క్రి)

అన. సనందనా! కృష్ణాజినముఁ జుట్టిపెట్టుము. (నిష్క్రమించును)

అం. అనసూయాదేవీ! ఈనారదునిరాక నాకాశ్చర్యముఁ గొల్పుచున్నది. అతఁడువచ్చిన కార్యమునందు నాకొకసందేహమే.

అన. ఏల?

అం. ఇనుపకనగ లెచటనైన నుండునా? దేవతలకు రోగములు కలవా?

అన. ఏమో, యెవ్వరెఱుఁగుదురు?

అం. నీవమాయకురాలవు. నీకొక చమత్కారమునుఁ దెలియదు

అన. నీవేమి గుఱుతించితివి?

అం. నాకిట్లు తోచుచున్నది. వాణీ రమా పర్ణలకు నీవు నారదునివలనఁ బంపిన సందేశ వాక్యములలోని భావవిశేషమును వారు దూషణార్థము గ్రహించి యుండవచ్చును. అతని మాటలలో నీయెడ పంతము వహించి యనుమాట బయలు వెడలె. నాయూహ సరిపోవుచున్నది అట్లు నీపైఁ గోపము వహించియుండి నిన్నుఁ బరీక్షించుట కీచమత్కృతిఁ బన్ని యున్నారని తోచుచున్నది. లేకున్న నారదుఁడు చెప్పుటలో సహజముగా నీకు నుక్కుశనగలఁ బంపినారని పల్కి మరలఁ బెక్కు వరములని దిద్దుకొన్నాఁడు. కావున నిందేమో చిత్రమున్నదని నాకు నిశ్చయముగాఁ దట్టుచున్నది.

అన. అంబికా! అట్టి యూహాలన్నియేల? నారదమహర్షి యనృతములాడునా? ఎవరికైనను బొరపాటు పల్కులు రాఁగూడదా? అదియునుగాక యతనికి శరీరము నెమ్మదిగాలేదు,

పల్కు పొరపాటులని యతఁడే చెప్పలేదా? త్రిమూర్తుల భార్యలకు నాపై యలుకయేల కలుగును? వారిని నేను దూషించినానా? నావాక్యములు వినయ పూర్వకములని వారు గ్రహించి యుండరా? సరస్వతీదేవియైన వివరించి యుండదా? నాకట్టి భయమేమియు లేదు. నీకేల లేనిపోని సందేహములు.

అం. సరే. నీచిత్తము. ఈదినము కాకున్న వేఱొకదినమైనను గనఁబడక పోవునా? విదియనాడు చంద్రుఁడు కనిపింప కుండినఁ దదియనాడు కన్పింపఁడా! చూతము. ఈపరీక్షవలన నీకీర్తి యినుమడించునేకాని మఱెట్టి లోపములేదు. నాకదియే సంతోషము. పోదమురమ్ము. (నిష్క్రమి)

---

తృతీయాంకము — ద్వితీయరంగము.

కైలాసము. పార్వతి. ఈశ్వరుఁడు.

పార్వ. నాథా! మొన్న సోమవార మెచటికిఁ బోయియుంటిరి.

ఈశ్వ. నరలోకమునకు. అత్ర్యాశ్రమమునకు.

పార్వ. ఏల?

ఈశ్వ. అచ్చట నారద మహర్షి నాకు క్షీరాభిషేక మొనర్చి. గ్రహించి వచ్చితిని.

పార్వ. సరే! ఎక్కడ నభిషేక మొనరింతురో యెచ్చట బిల్వమును సమర్పింతురో యాయాతావులకుఁ బరుగెత్తుచుందురు. నా యోగ క్షేమముల జోలిమీకేల?

ఈశ్వ. (స్వ: ఓహోహో! ఏమియో యలుకఁ బూనియున్నది.) ఇప్పుడేమి?

పార్వ. ఏమైననేమిః ? ఆనారదుఁ డిచటికి వచ్చియుండెఁ. అయత్రి భార్య యనసూయయుట. మహాపతివ్రతయట. ఆమె మహిమల నగ్గడించె.

ఈశ్వ (స్వ॥ అతఁడిచ్చ్యోడ నెట్టికోప బీజమో నాటి పోయినాఁడు) ఔను, సతీమణియే !

పార్వ. సతీమణియో ! శిరోమణియో ! చింతామణియో ! ఉండుఁ గాక. నన్ను దూషించునదియా ? తనకంత పొగడుఁదనమా?

ఈశ్వ. పార్వతీ ! ఆనారదుని మాటలతో నేమి ? ఎవరితోడ నేమియోచెప్పి కినుకఁ బుట్టించుచుండును. కలహ భోజనుఁడని మనమెఱుఁగమా ?

పార్వ. అతని పల్కులు కల్లలెప్పటికినిగావు. అందులకు మీరే సాక్షులు. మీకు క్షీరాభిషేక మొనర్చినట్లతఁడు గూడఁ జెప్పినాఁడు. ఈమాట మాత్రము నిక్కము. తక్కినవి టక్కులా ? ఆఋషి పత్ని పంపిన సందేశము ముమ్మాటికి సత్యమే. సందేహము లేదు.

ఈశ్వ. ఏమి సందేశమా యనసూయ పంపినది. చెప్పవేటివే ?

పార్వ. చెవులారవినీ, సంతోషింపుఁడు. చెప్పెదను.

గీ॥ నీకృపాలోకనముచేత నెలతలెల్ల ।
రఖిలమంగళములఁబొల్తు, రయిన, వారు ।
చండికలుగాక మగలనుసగము సేయ ।
కుండవర్తించునటులు సేయుముభవాని ॥

ఈశ్వ. ఇంతేనా ?

పార్వ. ఇంకెంత కావలయు ? ఇంకను నెక్కువైయుండిన మీకానందమేమో ?

ఈశ్వ. నిన్ను భూషించినదియే !

పార్వ. పైన భూషించినది. దిగువ దూషించినది. ఇదివినయమా ! ప్రార్థనయా ! దిట్టముగాఁదెగ నాడుటయేకదా ! నిక్కముగా నిందయేకదా !

ఉ॥ కండలఁ గ్రొవ్వుచేతనను గ్రక్కొన కిట్టులుతిట్టినట్టియా ।
యుండజయానకావరమునంతయు నేనడఁగించియిప్పుడే ।
దండనసేయుదానవనితాజన మచ్చెరువందిచూడ, నేఁ ।
జండికనౌటఁజూపెదను జాగిలిమన్ననవేడునంతకున్ ॥

ఈశ్వ. (స్వ॥ అహా ! ఆసాధ్వి చాతుర్యముచే శ్లేషవచించినది. ఈపర్వత పుత్రి దూషణార్థమే గ్రహించినది) శర్వాణీ ! ఇంత యలుకయేల? నీవు చండివే, అసత్యమా? నాలో నర్ధరూపిణివే, కల్లయా ? ఆపద్యమునందలి భావమిదియే. గ్రహింపవలదా ?

పార్వ. గ్రహించియే యున్నాను. నామనముందహించుచున్నది. నేనొక్కింతయు సహింపఁజాల మీా టీకలతో నేమి ?

ఈశ్వ. (స్వ॥ ఇక సమాధానముఁ జెప్పుకొలఁది హెచ్చగును. ఏకీభవించినగాని చల్లారదు ) నిజమే. యోచించి చూడ వేఱు మాటలు లేకపోయెనా ? రెండర్థము లెప్పటికిని బ్రమాదములే.

పార్వ. ప్రమాదమునందలి భయముండినఁగదా యట్టి పల్కులు రాకుండును. ఆప్రమాదము నేను జూపించెదను. చండికనట! లలితనుగానా ? మగనిని సగముజేసి పీల్చివైచెదకా ! 'శివార్ధాంగి' యని యనుటకు నోరురాక .పోయెనా ? ఆచెలువ తలఁపుననే నంతటి యవివేకనా ? అంతటి ఱాగనా ? నా

యెడదయుడుకుచున్నది? తనకు మాంగల్య సౌభాగ్య మెవరి వలన వెలయుచున్నది. ఎట్టి దరిద్రులకును మంగళ పరంపర లెవరి కడకంటి చూపువలన లభించుచున్నవి? ఎఱుఁగ వలదా? ఇదియే నాకృతజ్ఞత? మీరీ క్షణమేపోయి యాసీర జాక్షి నవమానపఱచి వచ్చినగాని నాకుక్షిచల్లారదు లేకున్న నేనే పోయెదను.

ఈశ్వ. (స్వ॥ మించిపోయె, సాధ్యముకాదు. నారదుఁడు మంచి పనిపెట్టి పోయినాఁడు.) హృదయేశ్వరీ! శాంతింపుము. సుం తయుఁ జింతింపకుము. ఈఘడియలోనే పోయి యాయంగ నకు గర్వభంగ మొనరించి వచ్చెద.

పార్వ. అటులయిన సంతసమయ్యెడు. లేఁడు. పయనమగుడు. నం దినీ సిద్ధపఱచెద రండు.

ఈశ్వ. అవశ్యము. పద. (అనసూయాగర్వముకాదు. పార్వతీ గర్వమణఁగును.) (నిష్క్రమింతురు.)



## తృతీయాంకము — తృతీయరంగము.

ప్రవేశము. నారదుఁడు.

అబ్బబ్బ! భారతీ భార్గవీ భవానుల కోపోద్రేక మింతగా నెన్నఁడును జూచి యుండలేదు. అనసూయా వాక్యములఁ జెప్పినపుడే యొకరొకరు కన్నులెఱ్ఱచేసి గట్టల్క గ్రక్కినది చూడ భయమగుచుండె. ఇపుడా కినగగుగ్గుళ్లనుదెచ్చి వారి కిచ్చినతోడనే యనసూయవలనఁదమకే యవమాన మా యెననియెంచి త్రేతాగ్ను లొక్కసారిగాఁ బ్రజ్వలించి పెను

పెంటల వెలిబుచ్చినట్లు మండి పడుచున్నారు. పార్వతీదేవి కాళీయవతారమే యొందినది లక్ష్మీదేవి కెంపుల రూపము దాల్చినది. సరస్వతి వీరరసగ్రంథ స్వరూపమైనది. ఇఁక వీరు ముగ్గురు నాపతివ్రతామణిపై తప్పక దాడివెడలుదురు. తామే పోవుదురో తమవిభులఁ బంపెదరో తెలియదు. తామేచనిన నసాధ్యమని వారికే దృఢపడినది. అందులకు శసగలేసాక్షి. ఇఁకఁ దమ నాథులను బంపఁబూనెదరు కాఁబోలు. ఆపత్తుమున పార్వతి పల్కులకు బదులాడక సాంబుఁడు తక్షణము ప్రయాణమగువాఁడే. అర్ధనారీశ్వరుఁడు, తెలిసియే యున్నది. బ్రహ్మదేవుఁడు, తనకుఁజేదోడు వాదోడుగానుండు సరస్వతి మాటఁదీసి వేయఁజాలఁడు, ఛాందసుడు, పయనమగువాఁడే ఇంక మాధవుఁడు..ఇతఁడు జగన్నాటక సూత్రధారి. మిక్కిలి యోజింపనిదే యేకార్యమైనను జేయువాఁడుగాఁడు. లక్ష్మి మాటఁ ద్రోసివేయకుండ, ననసూయకు హానిసేయకుండ, కన్నుపోకుండఁ గాటుక సెడకుండ యుక్తిగాఁబోవు వాఁడే కాని తనభార్య మాటయని భక్తులమీఁద దబ్బునఁ బోవు వాఁడుగాడు. కావుననిది యెట్లు పరిణమించునో చూచెదఁ గాక ! (నిష్క్రమించును)



## తృతీయాంకము — చతుర్థరంగము.

ప్రవేశము. ఈశ్వరుఁడు.

స్వా॥ నారదుఁడూరకుండక యేదియో కలఁతఁదెచ్చిపెట్టినాడు అనసూయ పంపిన ప్రార్థనయందు దూషణార్థమే గ్రహించి పార్వతి వీరావేశమొందిన దింకే కారణముచేతనో యామె పై మిక్కిలి కోపమూనినది. ఆకారణముఁజెప్పదు. అన

సూయను దక్షుణమవమాన పఱచిరమ్మని బాధించుచున్నది. స్త్రీ జనమునకు మూర్ఖము సాధారణముగా నుండును. వారిలో పార్వతి పట్టినయెడల ఱాతిపట్టే. అనసూయ మహాపతివ్రత. పతివ్రతలఁజెనకుట దుష్కరము.

సింగముమీసముల్ గరముచేఁగొనిలాగఁగవచ్చు, నాగుపా ।
ముంగొనికేలఁజుట్టుకొనఁ బోలుగరీంద్రముతొండమీడ్చునా ।
ప్పింగగరానిబల్విసము ప్రింగఁగవచ్చుఁబ్రయత్నతఁ గుణో ।
త్తుంగపతివ్రతామణికి ద్రోహముసేయఁదరంబె యేరికిఁ ॥

కావున నాకేమియుఁ దోచలేదు. యోచించెదగాక.

(నిష్క్రమణ)

ప్రవేశము. విష్ణువు.

స్వ॥ నరలోకవాసినియగు ననసూయాదేవి సతీరత్నము. నాయందనన్య భక్తిఁగలది అత్రిమహర్షియు తనతపస్సుచే నన్ను వశపఱచుకొన్నాఁడు. ఇరువురు పవిత్రజన్మములు, పవిత్ర జీవనములు, పవిత్ర చరిత్రములు గలవారు. వీరు త్రిమూర్తి స్వరూపుఁడనగు నన్నుఁగొల్చి నాప్రసన్నముఁ బడసినపుడు వరములఁ గోరుమనగాఁ ద్రిమూర్తులబోలు పుత్త్రులను బ్రసాదింపుమని యనసూయ కోరియుండె. అపుత్రప్రాప్తి వేళ నేటికి సమీపించినది. అదియునుగాక వాణీ రమా గౌరులు త్రిశక్తులమని సర్వనారీసమూహమునఁదామే యెక్కువమని కొంచెము దురభిమానమును గలిగియున్నారు. వీరి గర్వభంగమునకును, అనసూయకుఁ బుత్త్రుల నిచ్చుటకును గారణము సంధించి నారదుని సంచారమును అనసూయా సందే

శములను నేన కల్పించినాను. ఇనుప శనగలను సరస్వతీ దేవి చేయించి యనసూయకుఁబంపిన పన్నుగడయును నా తంత్రమే. లక్ష్మిపట్టరాని కోపమూనియున్నది రాత్రియంతయు నిద్దురలేదు. లక్ష్మియైననేమి, యెవరైననేమి వారి గర్వము నడపక విడువను. ఇపుడు బ్రహ్మాదులతోఁగలసి పోవలసినది గాఁయున్నది.

గరుఁడా!

గరు. దేవా!

విష్ణు. అచ్చటఁ బోవుచుండు వారెవరు? శంకరుఁడున్నట్టున్నదే.

గరు. ఔను.

విష్ణు. దయచేసి నిలువుఁడనుము.

గరు. శంభో! మహాదేవ! శంభో! మహాదేవ! (అనిపోయి మరల నీశ్వరునితో ప్రవేశము.)

ఈశ్వ. నారాయణా! నమస్కారములు.

విష్ణు. ఇందుమౌళీ! వందనములు. ఎచ్చిటికిఁ బయనమైనారే?

ఈశ్వ. మానవలోకమునకు.

విష్ణు. పార్వతీ సమేతగాలేక యొకరే పోవుచున్నారే?

ఈశ్వ. ఔను. పార్వతికి నేడు కోపము బుట్టినది. ఆకారణమున నేనొకఁడనే పోవలసి వచ్చినది.

విష్ణు. ఆకోప కారణమునే నెఱుఁగవచ్చునా?

ఈశ్వ. వాసుదేవా! నీకుఁదెలియని మర్మములు గలవా? భూలోకమున వసించునట్టి యత్రిభార్యయగు ననసూయ యొక సందేశము గొరికిఁ బంపియుండగా దానిలో నొకయర్థ విశేషముచే నామెపై మిక్కిలి కినుకఁబూని నన్నుదాడి పంపినది. చండిదేవత, నీకుఁ దెలిసియే యున్నది.

విష్ణు. ఆలాగా ! ఆసతీమణి యిందిరకొఱకు విన్నపమదే నారదునిచేఁ బంపి యందులో రమనుగొంత నిందించినది నాకునుగోపమే నేను నందులకే ప్రయాణమై వచ్చినాను. మహిమగలది యగునుగాక. దైవతములను దూషింప వచ్చునా ?

ఈశ్వ. చూడుము. ఎంతగర్వమో.

ప్రవేశము. బ్రహ్మ.

బ్రహ్మ. ఓహో హరిహరుల దర్శన మొక్కచోటనే యాయెనే!

భో॥ వి॥ శ్రీరమణా ! సంశ్రితావనా !
వారణచర్మాంబరా ! హరా ।
ఈరలుగై కొండిదే నమ ।
స్కారములే నాచరించెదన్ ॥

వి. ఈ. విధాతా ! నీకును నమస్కృతులు.

విష్ణు. ఏమి ? హంసనెక్కి వచ్చియున్నావే ! ప్రయాణమా ?

బ్రహ్మ. ఔను. భూలోకమునకుఁబోయి రావలసియున్నది.

ఈశ్వ. ఏఃయని యడుగవచ్చునా ? దుశ్శకునము గాదుగదా ?

బ్రహ్మ. నాప్రమాణమున మీయుభయుల దర్శనము సుశకునమేగద ! మీకుఁజెల్పని యర్థములేవి కలవు ! అత్రిముని యిల్లాలు శారదకొఱకు విజ్ఞప్తిఁబంపినది. • అందలి యర్థవిశేషముచే శారద యలుకబూని యాయనసూయ నగడు పఱచిరమ్మని మూర్ఖము పట్టియున్నది విద్యావతియయ్యు నామమాధానము వినదు. చదువురాని వారికి బోధింపవచ్చును చదువుకొనిన మూఢులకుఁ జెప్పుట కష్టము. నిన్ను డికించెద, నిన్ను డికించెదనని వదరుచుండును. ఏమియని ప్రశ్నింపఁగా వివరించి చెప్పదు. ఈభార్యలతో వేగుట యసాధ్యము. ఇందులో

నా కేమియుఁదోఁచలేదు. ఈదినము కశ్యపులువారికిఁ గార్య
క్రమమప్పగించి బయలుదేరి వచ్చినాను. మీరెక్కడికిఁ
బోవుచున్నది ?

ఈశ్వ. మేమును భూలోకమునకే, అనసూయా గృహమునకే,
యిట్టికారణములకే, యిదే యవస్థకే.

బ్రహ్మ. ఆహా ! ఆశ్చర్యముగా నున్నదే ! ఇంకేమియౌనో చిత్రమున్నది
దీని పర్యవసానమేమో తెలియదు. ఈమహానుభావుఁడే
యెఱుఁగును. మాధవా ! ఊరకున్నావేమి ? ఎట్లుచేయ
నెంచియున్నావు ? నేను నీవెంబడి వచ్చువాఁడనే.

విష్ణు. విరించి ! దీనికొక యుక్తిఁదలంచియున్నాను దానినంతయు
వివరించెద. కారణాంతరములు రెండు గలవు. తెల్పె
దను. మనము ముగ్గురమతిథి వేషములఁబోవలయు·
రమ్ము. మహేశ్వర, రమ్ము గరుడా ! నీవుండుము.
నందిని, హంసను వుత్తెంచుము.

ఈశ్వ. కమలాక్ష నాకింక దిగులులేదు. పోదము. పద. (నిష్క్రి)



తృతీయాంకము —— పంచమరంగము.

అరణ్య ప్రదేశము. అత్రి కన్నులు మూసికొని తపస్సు
చేయుచుండును· జాతవేదుఁడు, (శిష్యుఁడు)
(దూరమునఁగూర్చుండి యుండును)

అత్రి. (కన్నులు దెఱచి)

శ్రీరామరామరామేతి, రమేరామేమనోరమే ।
సహస్రనామతత్తుల్యం, రామనామవరాననే ॥

(జాతవేదుఁడు నమస్కరించును)

జాతవేదా! మనము వచ్చినదెన్నడు?

జాత. గురువర్యా! షష్ఠి సోమవారమునాడు. ఆదినమే మీరు తపస్సునకుఁ గూర్చుంటిరి.

అత్రి. ఇదిమార్గశీర్ష శుద్ధముకదా?

జాత. ఔను.

అత్రి. నేఁడు దివసమేమి?

జాత. చతుర్దశి మంగళవారము.

అత్రి. తొమ్మిది దినములయినవా?

జాత. ఔను.

అత్రి. ఇపుడెంత ప్రొద్దయినది?

జాత. పదునాల్గు గడియల ప్రొద్దెక్కినది. ఫలములగొనివచ్చితిని. భుజింపనగును.

అత్రి. సంతోషము. ఫలములపై నిచ్ఛలేదు. పర్ణశాలకుఁబోయి కొన్ని పాలు కొనిరమ్ము. అటులనే నాధోవతులఁ దీసికొని రమ్ము. వచ్చునపుడనసూయతో నేఁడు వచ్చుచున్నాననియు నతిథిపూజ నేమరక కడుభక్తితోఁ జేయవలెననియుఁ జెప్పుము అతిథి విష్ణు స్వరూపుఁడు. ఎట్టివి గోరిన నొసఁగుట ధర్మమని మందలించుము. శిష్యులయు బాలికలయు క్షేమముల నరసి శీఘ్రముగరమ్ము. నేను నదియొద్దనకుఁ బోయెదను. (నిష్క్రమణ)

జాత. చిత్తము. (నిష్క్రమణ)

## తృతీయాంకము — షష్ఠరంగము.

అత్రిముని పర్ణశాల. అనసూయ. అంబిక.

అన. అంబికా !

ఉ॥ తొమ్మిదినాళులాయె మునిధూర్జటి యేగి తపంబొనర్పఁగా ।
నిమ్మునఁ జేరఁగా మరల, డిమ్మగఁ దద్వదనాంబుజావలో ।
కమ్మసరింపకుండిన సుకమ్మొకయింతయు లేదు డెందమున్ ॥
దిమ్మయి నన్ని ప్రొద్దులిక నేగగనున్నవొ ! యేమి సేయుదున్ ॥

సీ॥ కాంతుఁడు లేకున్నఁ గ్రమియించుచున్నట్టి
దినములెంతటి శ్రేష్ఠదినములైన ॥
నాథుఁడు లేకున్న నానావిధ
రసాన్వితంబులయిన పదార్థంబులైన ।
పతిచెంత లేకున్న బహువిధశృంగార
దాయకాభరణ వస్త్రంబులైన ।
విభుఁడొద్ద లేకున్న వివిధసమ్మద
జనకంబులయిన ప్రసంగంబులైన ॥
గీ॥ ప్రభ దనర్చునే, సుంతయు రసన కెక్కు ।
నే, శరీర మొప్పునె, మదికింపొసగునె ।
కాన, పతిబాసినట్టియే చానయైన ।
ధాత్రి, చంద్రుఁడు లేనట్టి రాత్రిగాదె ॥

వెంటనే వచ్చెదన్న, ‘వలదు. ఇంటనుండు’ మని యాజ్ఞఁ చేసి పోయియున్నాడు. అయినను దర్శనము చేసికొని వచ్చెదను, నీవిచటనే యుండి యతిథియభ్యాగతులను విచారించుకొనెదవా ?

అం. అమ్మా! నేను నీయాజ్ఞకు బదులు చెప్పుదునా? అభ్యంతరము లేదు. ఇంటికి వచ్చువారికిఁదగిన సపర్యలను దప్పక గావింపఁగలను. కాని యొకవేళ నారదునివలె, నేయతిథి యేనివచ్చి తాళ్లో అప్పలో తెచ్చి యప్పములుగా జేసి యిమ్మనిన నేనేమి చేయఁగలను? మహాత్ముఁ పర్యుఁడీదినమో తేపో రావచ్చునని తోఁచుచున్నది.

ప్రవేశము. జాతవేదుఁడు.

(అనసూయకు నమస్కరించును)

అన. అన్నా! జాతవేదా! క్షేమమా?

జాత. తల్లీ! క్షేమమే.

అన నాయనోవల్లభుఁడు తపస్సునుండి లేచియున్నాఁడా?

జాత. లేచియున్నారు తేపు వచ్చెదరఁట కొంచెము పాలనిప్పించుకొని రమ్మనినారు ధోవతియు నుత్తరీయమును దెమ్మనినారు. తీసికొని పోయెదను.

అన. సంతోషము ఇచ్చెదను, కొనిపొమ్మా. (లోపలికిఁబోయి వానిని దీసికొనివచ్చును)

ఈపాల నీఫలములగొనిపొమ్ము.

జాత. ఫలముల నక్కఱ లేదనినారు.

అన. అయిన, నీవారగించుము. తీసికొనుము.

జాత. చిత్తము. శిష్యులు, బాలికలు క్షేమముగ నున్నారుగదా!

అం. సుఖముగా నున్నారని చెప్పుము.

జాత. అమ్మా! నాకింక సెలవా? అతిథిపూజమాత్ర మెట్టిదుర్ఘటమైనను జేయుదగుఁనని సెలవిచ్చియున్నారు. అతిథి విష్ణుస్వరూపుడఁని జ్ఞాపకము నందుంచుకొమ్మనినారు నేనిఁక

బోయివచ్చెదను. ఇదే ప్రణమిల్లుచున్నాను. (నిష్క్రమి)

అం. అనసూయాదేవి! మునిచంద్రుఁడు తేపు వచ్చునట. ఇంకఁ జింతింపకుము.

అన. జాతవేదుఁడు వచ్చినపుడే నాచింత బాసె.

ప్రవేశము. ముగ్గురు బ్రాహ్మణులు.

మహాదేవ్యైనమః, త్రిపురాంబాయైనమః

అన. బ్రాహ్మణోత్తములారా! నమస్కరించుచున్నాను.

బ్రా. దీర్ఘసుమంగలీభవ! సుపుత్రావాప్తిరస్తు!

అన. స్వామీ! ఇచట నాసీనులరగుఁడు. తమరెవ్వరు? ఎచట నుండి విచ్చేసితిరి?

నా. మేముహిమాచల ప్రాంతమునుండి వచ్చినాము. ఇతని పేరు నీలకంఠయోగి, ఇతఁడు బ్రహ్మానందావధాని, నన్ను నారా భట్టారకుఁడందురు, అమ్మా! ఈయాశ్రమ మెవరిది?

అం. అత్రిమహర్షి గారిది. ఆయన ధర్మపత్నియీయామె అనసూయాదేవి నేనామె చరణసేవజేయుచున్నాను నేడు మాకు సుదినము.

నీల. ఆహా! ఈసతీమణియేనా యనసూయాదేవి? ఈమెకీర్తి జగద్వినుతమై యున్నది. ఈమె దర్శనము లభించె.

అన. చాలదూరమునుండి వచ్చినారు. తమ స్నానాహ్నికములఁ దీర్చుకొని నాయింటఁగలిగిన బిండియో బెల్లమో యారగించి నన్ను ధన్యురాలిం జేయవలెను.

నా. అందులకాక్షేపణములేదు. కాని, మావ్రతము కష్టమైనది అది కొనసాగువఱకు మాకు భోజనము లేదు. ఇప్పటికి మూడు దినములైనవి. ఇంకెన్ని దినములు తిరుగవలెనో తెలియదు.

అన అదెట్టి వ్రతము ? నాచేతనైన సహాయము చేసెదను.

బ్రహ్మ. అమ్మా ! నీవతిథి పూజాసక్తవని తోచుచున్నను విజ్ఞాపింప జంకుచున్నాము. నీవు మహాపతివ్రతవు.

అం. (స్వ॥ ఈవిప్రులేదియో యసాధ్యమైనది కోరునట్లు తోచుచున్నది. ఈమె కెప్పుడును విచిత్రమైన యతిథులే ఘటిల్లుచున్నారు.)

అన. ఎట్టి సంశయమును లేదు. దయచేసి చెప్పుడు.

నీల. తల్లీ ! చాల కఠినమైన విషయము. పిమ్మట నీవు కోపగింతువేమో, కావున వేఱొక చోటికిఁబోయెదము. సెలవిమ్ము. నీయాతిథ్యము వచ్చినట్టే యెంచెదము.

అన. విప్రోత్తములారా ! త్రిమూర్తులువలె నాగృహమునకువచ్చి, (ఈశ్వరుఁడు తనతలను, ఫాలమును దడవుకొనుచు బ్రహ్మకు సంజ్ఞచేసి యడుగును, బ్రహ్మచేతిసంజ్ఞతో గంగయు త్రినేత్రము లేదనును)

మీయభీష్టముఁదెల్పక, నాయింట భుజింపక వెడలిపోవుట మీకు న్యాయమా ? అట్లు మిమ్ము మరలనంపిన నాగృహిణీధర్మమేమున్నది. దయచేసి యేమి కావలెనోకోరి స్వీకరింపుఁడు. నాప్రాణమైనను ఇచ్చుదానను.

నా. అమ్మా ! ప్రాణమిచ్చుటకంటె కఠినమైన ప్రసక్తి. నీమాట సత్యమేనా ?

అన. క॥ వేదములు సత్యమేని !
శ్రీదయితుండనవరతము శ్రితపోషణుడేని ।
నాదగుపల్కు నిజంబని ।
భూదేవతలార ! నమ్మబోలునుసుండీ ।

నా. సాధ్వీమణీ! అటులయినఁ జెప్పెదము. మేము పరాశక్తిని బూజించినాము. మాకామ్య సిద్ధికొఱకు నాయమ సంప్రీతి కొఱకు నొక విధానము కొదవపడినది. దీనిని సేయకున్న మాకార్యము నిష్ఫలమగును. ఆశక్తికిఁ గోపము సంభవించును. ఏమనగా నొక సువాసిని వస్త్రరహితమై హస్తోదక మొసఁగి యన్నముఁబెట్టఁగా భుజింపవలెనని. ఇందులకు నిన్ను వేడుచున్నాము. దీనిచే మావ్రతము పరిసమాప్తి నొందుట యేగాక నీకిష్టార్థములు చెప్పక ఫలించుచున్నవి.

అన. హరి! హరి! (అని చెవులు మూసికొని తలవంచుకొనును)

అం. (స్వ|| నేననుకొన్నటులే యయినది. వీరు నిజమైన బ్రాహ్మణులుకారు.)

అన. (స్వ|| ఆహా! ఈయతిథులెట్టి దుర్ఘటమైన దానిని కోరిరి! వారనినట్లు ప్రాణములకంటె నెక్కువైనదే కోరుచున్నారు. హా! దైవమా! ఏమిచేయవలెను?)

భూసురమణులారా! మీరు స్నానములఁ దీర్చికొని కూర్చుండుఁడు.

నీల.
నా. } సంతోషము. (లోపలికిఁ బోవుదురు)
బ్రా.

అన. అక్కటా! అంబికా! పెద్ద పరీక్ష సంభవించె. ఈవిందులఁ దనుపుటెట్లు? నాసతీత్వమును గాపాడుకొనుటెట్లు? అతిథులుగోరిన యర్థమొసఁగకుండిన నాకు మిగుల పాపము గదా? నాయింటికి హానిగదా? నాపతి కపకీర్తిగదా? వీరభిలషించినది ఘోరముగా నున్నదే!

శా॥ పాలా! మీఁగడయా! ఫలంబ! పెరుగా! పక్వాన్నమా!
భక్ష్యమా! మేలౌపాకమునెద్ది కోరినను సంప్రీతిన్ సమర్పింపనా!
ఈలాగంబరహీననై కుడుపనే నెబ్భంగినూహింతునా!
శీలంబెట్లుసురక్షితంబగును యోజింపంగ లేనక్కటా॥

ఇట్టివేగాక మఱెట్టి దుస్తరమైన వస్తువులఁగోరియుండిన నిచ్చియుండు. నా యస్థిపంజరమంతయుఁగోరిన నొసఁగియుండు నామేని కండలఁగాంక్షించి యుండిన నర్పించియుండు. నా యొడలంతయు నభిలషించి యుండినఁ గుడుములుగాఁజేసి యిమ్మని నన్నడిగియుండు. నాశరీర రక్తమునే ద్రావనిచ్చగించియుండిన యొడలఁ గడవలనించి యప్పగించియుండు. అట్టి వెవ్వియును గోరరైరే! ఎయ్యది ప్రాణముకంటెఁ దీపో, యేది శాశ్వతమైన సుఖమునిచ్చునో, యెయ్యది మిక్కిలి గౌరవము నాపాదించునో, యెద్దిదిగంతకీర్తి గడించునో. ముఖ్యముగా మానవతుల కెట్టిది తమకును దమనాథులకును నిర్మల యశము నొడఁగూర్చునో యట్టిమానము వీడనగునా?

క॥ ప్రాణమనిత్యంబగుటన్ ।
మానంబారవిశశాంకమండితమగుటన్ ।
ప్రాణంబు బాసియైనను ।
మానమురక్షింపఁదగును మహినెవ్వరికిన్ ॥

అని పెద్దలు చెప్పుచున్నారు. అయ్యో! నామాన మిపుడెట్లు రక్షించుకొందును? ఎట్టి పాపములఁజేసి యుంటినో కదా!

ఉ॥ ఎట్టిపతివ్రతామణుల హేళనసేసితి వేళమదినే ।
రట్టునొనర్చియుంటినొ, కరాళపుఁబల్కులచేతవారల౯ ।
దిట్టినదాననో, మతిసతీజనగౌరవమర్హరీతి నే ।
పట్టునఁజేయలేదొ తొలి బాముసఁదద్దురితంబువొప్పునే ॥

హా! దైవమా! నన్నేలయిట్టి కష్టదశకుఁదెచ్చితివి. నీకిది వినోదమా! ప్రమోదమా! నేనే నేరముఁగావించి యుంటినో వానిని మన్నింపవే!

ఉ॥ కానక యెట్టికాలమునఁగల్మష మేమియొనర్చియుంటినో ।
దానికినీవునల్పఁగలదండనయాయిది! పాడిగాదు, నీ ।
మానసమందునుంచకుము, మన్ననసేయుము, వేఁడుదాన, నో ।
శ్రీనిధి, సత్కృపావనధి, సేవకలోకకరక్షసేవధీ ॥

అక్కటా! సీతాదేవి! మహాలక్ష్మీ స్వరూపిణివనియు, పతివ్రతామ తల్లివనియు భావించి నీకంగరాగములు మున్నగునవి యర్పించి గౌరవించి నందులకు ఫలమాయిది? అయ్యో! మహాగౌరీ! నీప్రీతి కొఱకెన్నియో నోములఁగావించి నందులకు ఫలితమాయిది? కటా! ఏదేవి జనక్రోధమో, యే దేవతల క్రోధనమో, యేగ్రహముల వేధయో యెఱుఁగజాల

క॥ రక్షింపుఁడంబలారా ।
రక్షింపుఁడు త్రిదశులార బ్రహావరులారా ।
రక్షింపుఁడు మీనిందుక ।
టాక్షముచేవాడుకుయ్యి నాలింపుఁడయో ॥

(అని యేడ్చును.)

అం. (స్వ॥ కటకటా! యీమె కెంత సంతాపము సంభవించె!)

అన. హా ! నాథా ! ఈగృహ కార్యభారము నాపైవైచి నెమ్మదిగ తపము నొనరించుచున్నాఁడవే. ఈదినము నీవేయుండిన యెడల నేమియాజ్ఞ చేయుచుంటివో, యెట్లు పరిణమించు చుండెనో, నాకెట్టి బాధయు లేకుండె. ఏదిగులును బొంద కుండియుండు. ఇప్పుడేమి గావింతు? ఏమి యూహింతు? ఈయతిథుల నే చొప్పున మెప్పింతు? నాచిక్కు నెప్పగిదిఁ దప్పించుకొందు?

అం. దేవీ ! నేవిట్లేల దుఃఖంచెదవు ? ఈవచ్చిన యతిథులు నిజమైన విప్రులుగారు నాకు పెద్ద సందేహము. కాకున్న నిట్టి వ్రతము ఋంకునా ? ఇట్టికోరిక యేపురుషుఁడేని నే స్త్రీని సిగ్గువిడిచి కోరునా? కావున నిన్ను బరిభవింపవచ్చిన రాక్షసులో, పరీక్షసేయవచ్చిన దేవతలో, తెలియదు. ఇట్టి సత్కారము చేతఁగాదనిచెప్పి పుచ్చుటవలన దోషములేదని నాయభిప్రాయము.

అన. సఖీ! అటుచెప్పఁదగునా? అతిథిని సంతుష్టుఁజేయవలెను, మనధర్మమును గాపాడుకొనవలెను. అతిథి విష్ణుస్వరూపుఁడు, ఎట్టి సపర్యయు సలుపవలెనని యిుపుడిప్పుడే నావిభుఁడాజ్ఞఁ జేసియుండఁడా ! నీయూహ లెట్లున్నను నాపతియానతి మీఱుదునా ? ఎప్పటికినిగాదు. వీరెవ్వరైన నగుదురుగాక ! ఎవ్వని మహిమాతిశయమున నారదునకుఁబాలు సమర్పించి తినో యెవ్వని యనుగ్రహ విశేషమున నాముసీంద్రునికి నుక్కుశనగల నుడికించి యిచ్చితినో యట్టి నాపతి చరణ

ముళ్లపై భారమునైచి వీరిని సంతృప్తులఁగావింతును. సర్వజ్ఞుండును, సర్వాంతర్యామియు, సర్వపతివ్రతా మానసంరక్షకుండునగు భగవంతుఁడు నాకుఁదోడ్పడుఁగాక ! నానాథుని కమండలువుఁదెమ్ము.

అం. అమ్మా ! చిత్తము. (కమండలువుఁదెచ్చియిచ్చును.)

అన॥ సీ॥ అనయంబునానాథుఁడపరదైవంబని
యుల్లమునఁదలంచుచుందునేని ।
పరపురుషులునాదు భ్రాతృలేయంచు
నాయంతరంగమునఁదలంతునేని ।
భక్తవత్సలుఁడైన పంకజాక్షు
నిశ్చలభక్తితోడ నేఁగొలుతునేని ।
ఇంటికినరుదెంచు నేయతిథులనైన
విష్ణురూపులుగ భావింతునేని ॥

గీ॥ ఇపుడువస్త్రవిహీననై యీధరామ ।
రేంద్రులకుఁబ్రీతిగా నన్నమిడెడువేళ ।
పరమమునియైన నాపతిపాదమాన ।
ముగురునొక్కటశిశువులై పొలుతురిచట ॥

(అని లోపలికిఁబోవును. అంబికయు వెంబడించును.)

(యవనికపడును.)



తృతీయాంకము — సప్తమరంగము.

ప్రవేశము. గరుడుఁడు.

స్వ॥ శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మ రుద్రులతో విప్రవేష ములతో ననసూయాగృహములోనికిఁబోవుచు నన్నిందే ప్రచ్ఛన్నముగా నూఁడుమని యాజ్ఞచేసియుండె. మధ్యా హ్నము మీఁటిపోయె. సాయంసమయమగుచువచ్చె. ఒక రును బయటికి రాలేదు. ఏమియో తెలియలేదు. ఈ చెట్టుపైఁగూర్చుండి యింకను నిరీక్షించెదఁగాక.

ప్రవేశము. నిరంజనుఁడు, సనందనుఁడు.

సన. నిరంజనా! ప్రొద్దున వచ్చిన బ్రాహ్మణులను అనసూయాదేవి పుత్రులుగాఁజేసి పాలిచ్చుచున్నది. అదేలరా?

గరు, (అయ్యో)

నిరం. ఎందుకనగా, దిగంబరియై యన్నము బెట్టవలెనని కోరిరట. అందుచేత నట్లొనర్చినది. అన్నము తినిపించినది.

గరు. (హా! దైవము!)

సనం. అటులనా! పాపలెంత ముద్దుగా నున్నారురా!

ఆ॥ వె॥ ఒకఁడుకర్పూరమున కుద్దిగానున్నాఁడు।
ఒకఁడుమబ్బువోలె నొప్పువాఁడు।
ఒకఁడుపసిడివన్నె నొప్పారుచున్నాఁడు।
వెలయుదేహమొకటె, తలలుమూఁడు॥

ఇదేమి యబ్బురముగానున్నదే!

నిరం. తనపాలిటి త్రిమూర్తులే యిట్లు పుట్టినారని దేవిగారు సంతో షించుచున్నారు.

(నేపథ్యమున :—" నిరంజనా ! పిల్లవాండ్రేడ్చుచున్నారు ")

ఇదేవచ్చితిమి. ఓసీ ! రమ్ము. (నిష్క్రమణ)

గరు. అకటా ! ఈత్రిమూర్తులు ముగ్గురు నాపతివ్రతా తిలకము నేమిరయో యవమానము సేయఁబోయి తామే వంచింపఁ బడిరి. భువనకర్తల కిట్టియవస్థ సంభవించెనే ! ఏమిచేయుఁగు ? ఈక్షణమేపోయి మహాలక్ష్మికిని, వాణికిని, శర్వాణికినిదెల్పి వారిని బిలిచికొని వచ్చెదను. వారు ప్రార్థించినంగాని యీ సాధ్వీమణి మాబోటివారికి సాధ్యమగునా ? ఇఁక దడవు సేయరాదు. జయ్ నారాయణ ! (నిష్క్రమించును)

---

తృతీయాంకము — అష్టమరంగము.

ప్రవేశము. నారదుఁడు

స్వ॥ ఈదినముదయమున బ్రహ్మలోకమునకుఁబోయి యుం డగాఁ గశ్యపమహర్షి యధికారము వహించి యుండెను. అయ్యో ! విధాత యెక్కడ పోయినాడని యడుగగా హరి హరులతోఁగూడి భూలోకమునకుఁబోయినాడని చెప్పెను. నాసందేహము నివృత్తియయ్యె. నేననుకొన్నటులే ముగురమ్మ గారుగూడి ముగురయ్యగారిని తప్పక పంపినారు. ఏమిచేయు దురో చూచెదను.

ప్రవేశము. గరుడుఁడు. (పరుగెత్తుచు)

నార. అయ్యా! వైనతేయా! ఏమట్లు తొందరగా మాటలాడు చున్నావు? నీకు పైత్యమా?

గరు. లేదు, లేదు.

నార. అంత వేగముగాఁ బోవుచున్నావేమి? నారాయణు నాజ్ఞ యయనదా?

గరు. అయ్యో! నారాయణుఁ డెక్కడున్నాడు స్వామీ!

నార. ఏమట్లనుచున్నావు? ఎక్కడకుఁబోయినాడు.

గరు. భూలోకమునకుఁబోయినాడు. అనసూయాదేవికి బ్రహ్మ రుద్రులతోఁగూడి శిశువైయున్నాడు. కార్యము తప్పినది. తక్షణము లక్ష్మీదేవిని వాణీగౌరీదేవులను బిలుచుకొని పోయెదను.

నార. అయ్యో! అటులనా? నేనును బయనమయ్యెదను. నీవును శీఘ్రమునఁబొమ్ము. (గరు. నిష్క్రమణ)

స్వ॥ నావృత్తమిప్పుడు ఫలించినది. కడుపునిండినటులాయెను. ఈచిత్రమును జూడవలెను. త్రిమూర్తులాయనసూయ నేమి యోశోధింపఁబోయి మోసపోయినారు. భార్యలు గోఁచ ప్రకారముపోయి గంగమ్మ దుముకు దుమికిరి, మునిగిపోయిరి. అమ్మగారికి గర్వభంగము సంపూర్ణముగానాయె. నాకిఁక బిలుపువచ్చునేమో. దిగులగుచున్నది త్వరగా వెడలవలె.

ప్రవేశము. గరుడుఁడు.

మునీంద్రా! నతులు, నతులు.

నార. ఖగరాజా! మత్తేమి? మత్తేమి?

గరు. రమారమణులు—కాదు—ఉమారమావాణుల కావార్తఁ దెలుపఁగా నపరిమితముగ.దుఃఖించుచున్నారు. మిమ్ముదయచేసి గమని ,పాలించుచున్నారు. రండు. లెండు.

నార. అయ్యా! గరుడా! నాకేమియుఁదోచలేదు. నాకును తొందరగానున్నది. రాజాలను. వారిని తత్క్షణము మోసికొనిరమ్ము. అనసూయ కడకుఁబోయి వేఁకొనవలెనని చెప్పుము. నేనును బోవుచున్నాను.

గరు. (స్వ॥ అకటా! నారాయణ భక్తుఁడు. లక్ష్మీదేవి బిలిచిన నిపుడు రాడుగదా! ఏమి కాలవిపరీతము. దణిలేనపుడెవరు నింతేగద? (అని పరుగెత్తును.)

(మరల త్రిశక్తులతో ప్రవేశము.)

పార్వ. గీ॥ అమరముని లోకచంద్ర! జోహారుమీకు।
లక్ష్మి. పరమభాగవతోత్తమా! ప్రణతిమీకు।
సర. ధాతృమానసపుత్ర! వందనముమీకు।
నార. అమ్మ! నాకిట్లు మ్రొక్కంగఁదగునెమీరు॥

పార్వ. ఋషివర్య! తప్పగాదు, కాని, వార్తవింటిరే?
నార. అమ్మా! వింటిని. మిగుల వ్యసన మగుచున్నది.

పార్వ. సీ॥ తనమేనియందెయర్ధము నొసంగినతఁబు
నన్నుఁగూర్చు ప్రియుండునాకులేడె।
లక్ష్మి. తనయురోవీధి సంతతముఃప్రీతిదలిర్ప
ననుధరించువిభుండు నాకులేడె।
సరస్వ. తనముఖాబ్జమునందె తాల్చికూరిమి
తోడఁగైకొన్ననాపతి నాకులేడె।
నార. నాపాటవినుచు నానందించికడదయఁ

పార్వ. గీ॥ అకటమునినాథ! గతియేమి? యరయుమయ్య।
లక్ష్మి. ఈదొసంగునుబావ నూహింపుమయ్య।
సర. నీవెపాలనుముంతువో, నీటముంతొ।
నార. కలిగెనేమందునమ్మ! యీకష్టమెంతొ।

గరు. హరి! హరి! దుర్భరము.

పార్వ. అనఘా! మావలె మీరు దుఃఖించినలెట్లు? మమ్ము దరిఁ జేర్చువారెవరు?

నార. దేవీ! నేనప్పుడే చెప్పలేదా? అనసూయపై చలముఁబూనకుఁడని. పతులు మీచేతులలో నున్నారని యామెపైపంపి యీగతులఁదెచ్చుకొంటిరి. మీకేగాక లోకములకే నాయకులలేకుండఁ జేసితిరే!

పార్వ. మాది నిక్కముగా నపరాధమే.

లక్ష్మి. మాకు బాగుగా గర్వభంగమాయె.

సర. మేమాసతీమణి జోలికిఁకఁబోము. ఏసతీమణి నింకఁదడపము. దురభిమాన మీదినమునుండి బాసితిమి.

నార. (మార్గమునకు వచ్చినారు. ఉపుకుచల్లాఁడినది)
అమ్మలారా! సరియేకాని, నాకేమియుందోచలేదు. సర్వ లోకాధిపతులకుఁజిక్కు గలిగినది. ఎవ్వరు దొలగింప సమర్థులు. సమస్త దేవతాకోటికి, ఋషికోటికిఁ దెలియజేసి, వారిని బిలుచుకొని—

పార్వ. ఋషీంద్ర! అటుసేయకుఁడు. ప్రార్థించెదను.

లక్ష్మి. ఎవ్వరికిఁదెల్ప నక్కఱలేదు. మీరొక్కరే చాలును. పోదముగదండు.

సర. మిమ్ము ముందుంచుకొని యాసాధ్విని వేడుకొందుము. ఆమె పరిచయము మీకెక్కువగదా?

నార. ( స్వ॥ ఏమి యాపత్కాలము! ) తల్లులారా! అట్లే యగుఁగాక. బయలుదేరుఁడు.

లక్ష్మి. గరుడా! లెమ్ము. మేము ముగ్గురము క్షణమాత్రమున ననసూయా గృహమును జేరవలెను.

గరు. చిత్తము

పార్వ. రమాదేవీ! నారదులు వారికి నందినిఁదెప్పింతునా?

సర. వలదు, నంది నడకమందము, నేను హంసను దెప్పించెదను.

లక్ష్మి. మునీంద్రా! మీకేది యిష్టమో చెప్పుఁడు.

నార. (స్వ॥ వీరిపుడు, నందిపై గరుత్మంతుఁడు, గరుత్మంతునిపై హంస, హంసపై నేను గూర్చుండెదను. మీరు నడచిరావ లెనన్న నట్లే యొనర్చుటకు సిద్ధముగా నున్నారు. సంకట వేళ యెట్టివారికి నిట్టిదేగదా!
అమ్మా! నాకంతటి యోగ్యతయా! అదియుఁగాక నాకేల, వాహనములు తల్లీ! యేకొంతపైనేని జాటి పడుటకు మీవెంటనే వచ్చెద, పదుండు

పార్వ. చిత్తము, రండు. (నిష్క్రమణ)

(సరస్వతి పోవుచు దిరిగిచూచును)

నార. అమ్మా! సందేహమా! ఇదిగో వెంబడిగానే వచ్చు చున్నాను. (నిష్క్రమణ)



తృతీయాంకము — నవమరంగము.

(పర్ణశాల. (సనందనుఁడు తొంగ్లి చూచుచుండును.)
ఎంతపెద్ద గరుడపక్షియిది? హంసో — అని లేచిపోవును.

అంబిక ప్రవేశము.

సనందనా! పిల్లవాండ్రేడ్చుచున్నారు. ఎచ్చటికిఁబోయితివి ?

( ప్రవేశము. )

సనం. అమ్మా! వచ్చితి. వాకిటియొద్ద నొకపెద్ద గరుటామంతుఁడు తొంగిచూచుచుండ వదలించి వచ్చితిని.

అం. నేనూచెదను. పొమ్ము (అని యుయ్యాల నూచుచుండును) అయ్యలారా! నిదురింపుడు. పాటఁపాడెదను.

క॥ జోజో! పుత్రకులారా!
జోజో! యాత్రేయులార! సుమశరులారా।
జోజో! చందురులారా।
జోజో! ముత్తెంబులార! జోజో! జోజో॥

అయ్యో! పిల్లఋషులు! స్నానమైనది, పానమైనది. ఇది పారాయణమా? ఇంకను మానరేమి? నాచేయి నొప్పెత్తుచున్నది.

అమ్మా! అనసూయాదేవీ!

అనసూయ ప్రవేశము.

అన. ఏమి?

అం. నీకుమారులేటికి యేడ్చుచున్నారో చూడుము. ఏడ్పుమానరు. నిదురింపరు. నాచేతగాదు. ఒకరుతప్పిన నొకరేడ్చుచున్నారు ఈనల్లనయ్య యసాధ్యుఁడు. ప్రక్కవారికి నేర్పుచున్నాఁడు.

అన. అన్నలారా! అల్లేల? నీళ్లుపోసితిని, పాలుపోసితిని. ఈసంగీత ముడిగి పరుండరాదా! నిదుర రాలేదా? నేఁబాడఁ బాడుదునా?

సీ॥ పసిడివన్నియతోడపసమీఱి, తెల్వికి
బసయైనముద్దుమోమొసగువాఁడ!
కప్పురంగులవాడ! నెప్పరితనముల
కుప్పనాఁజనుమేలఁగంబొప్పువాఁడ।
తెల్లతెల్లులవాఁడ! పెల్లుచీరంబుప్ప
తిల్లెడు నెమ్మోముజెల్లువాఁడ।
నెమ్మదిగలవాఁడ! యొమ్మెలుగలవాఁడ
నిమ్మళిమొకమూలఁజిమ్మువాఁడ।
గీ॥ నీకునంచనిత్తు, నీకుఁదామరనిత్తు।
నీకుజింకఁదెత్తు నిక్కువముగ।
నెమ్మితండ్రులార! నిదురింపరాదోకో।
లాలిలాలిలాలి, లాలిలాలి॥

అం. చూచితివే, నీపాట కేద్వు జాలించిరి. ఈపిల్ల ఋషులు సామాన్యులా? నాపాటచెవితీట, నీపాట తేనతేట కాఁబోలు.

సనందనుఁడు ప్రవేశము.

అమ్మా! తాతగారు, జాతవేదుఁడువచ్చుచున్నారు

అన. నాథుడు వచ్చెనా? అంబికా! పాద్యము తెచ్చెదను.
(లోపలికిఁబోవును)

ప్రవేశము అత్రి జాతవేదుఁడు.

అన. (ప్రవేశించి యత్రియడుగుల గడిగి నమస్కరించును.)
(అంబికయు నమస్కరించును)

అత్రి. కల్యాణమస్తు. ప్రేయసీ! మీరందఱు క్షేమముగానున్నారా?

అన. మీచరణానుగ్రహముచేత సౌఖ్యముగా నున్నాము.

అత్రి. (తొట్లనుచూచి) ఈయుయ్యాల యెవ్వరిది!

అన. మీకొమారునిది—కాదు—కొమాళ్లది ఎట్లు చెప్పవలెనో నాఁకు దెలియదు. ఇదిగో చూడుఁడు (అని పిల్లవాని నెత్తుకొని చూపును.)

సనం. గురునాథా! నాఁకు దమ్ములు పుట్టియున్నారు.

అత్రి. ఇదేమి శిశువు చిత్రముగానున్నదే ముమ్మొగములు. ఆఱు కేలు. ఒకమేను. అనసూయా! ఈశిశువులెట్లు సంభవించిరి? అందఱు నవమాసముల కొకరిని గనుచుండఁగా నీవుతొమ్మిది దినములకే ముగ్గురిని గంటివేమి? ఆశ్చర్యముగానున్నదే?

అన నాథా! ఈనాడు మువ్వురు సద్బ్రాహ్మణులు వచ్చియుండిరి ఆతిథ్యము స్వీకరింపుఁడనఁ దమకు పరాశక్తి ప్రతమొకటి యున్నదనియు నానియమమునకై యొకసువాసిని విగలిత వస్త్రయై యన్నమిడవవలెననియు నటుగాకుండిన వెడలిపోయెదమనియుఁబల్కఁగా మీయానతిమేరకు నతిథుల మరలఁబంపనేరక మీచరణ సరోజములపై భారమువైచి భవదీయ కరకమల స్పర్శన పవిత్రంబులైన కమండలూదకము వారిపైఁ బ్రోక్షించి నిర్వాణముగా నన్నిము బెట్టఁబోగా నీరీతి శిశువులైరి. ఇదియే వీరుపుట్టిన వృత్తాంతము. మీచరణ మహిమ. నానోము ఫలించె. నాధర్మమును గాపాడుకొంటి.

అత్రి. మేలు! మేలు! ఏమి? ముగ్గురు భూసురవరులా?

అం. మునిచంద్ర! భూసురవరులో, సురవరులో, యసురవరులో, నాకేమో సందేహమే. లేకున్న నట్టి కోరికఁగోరుదురా?

(అత్రి దివ్య దృష్టితోఁజూచుట నభినయించి)

అత్రి. ఆహా! ప్రియసతీ! నీవు ధన్యవతివి.

ప్రవేశము. నిరంజనుఁడు

నిరం. గురువర్య! ఒక తెక్కల మానిసి ముగ్గురు పెద్దముత్తైదువలు వచ్చుచున్నారు.

అత్రి. నేనెదుర్కొనఁబోయెదను.

ప్రవేశము. నారదుడు, పార్వతి, లక్ష్మి, సరస్వతి, గరుడుడు.

అత్రి. దేవమునీంద్ర! అభివందనములు.

నార. అత్రిమహర్షి వరేణ్యా? మీకు నమస్కృతులు. వాణీ రమా గౌరీదేవులు విచ్చేసి యున్నారు. అనసూయాదేవిని దర్శింప వచ్చినారు.

అత్రి మహానందము, మహానందము.

క॥ వాణీ! శ్రీనారాయణి ।
రాణీ! రుద్రాణి మీరుప్రత్యక్షంబై ।
కాణించుటయేబహు క ।
ల్యాణంబులుఁగొంటి, వ్రతఫలంబులఁగంటిన్ ॥

పా. } అనసూయాదేవీ! శరణు. శరణు.
ల. }
స. } (నమస్కరింపఁబోదురు.)

అన. దేవేరులార! ఇదియేమి? ఇదియేమి?

క॥ మీపాదధూళిసోకఁగ ।
నీపర్ణగృహంబుదగునె యేమిసుకృతమో ।
యేపావనతలమోతల్లి ।
యీపగిదిన్నాకు శరణమేలా! తల్లీ ।

(అని నమస్కరింపఁబోవును)

పార్వ. సతీమణీ! మేము నీవందనముల గ్రహింప నసర్హులము. నీవు మాకర్తవు. నీయిల్లు మావల్లభులకుఁబుట్టినిల్లై యుం డఁగా దానియందు మాపాదములతో నడచుట దోషము గదా, తలతోనే నడువవలయు.

అన. భవానిదేవీ! ఏమట్లనుచున్నావు? మీపతులకు నాగృహము పుట్టినిల్లెటులయ్యె.

నార. (వారి వృత్తాంతము వారే విన్పించుటలెస్స. గుట్టులన్నియు బయటికిపడును.)

అం. (నాసందేహము పరిష్కారమయ్యె.)

లక్ష్మి. పతివ్రతామణీ! పుత్రులుగాఁజేసితివి. కావున పుట్టినిల్లాయె. లేకున్న వీరట్లు కలిగిరి?

అం. (కమండలూదక ప్రభావమునఁగలిగిరి)

నార. (మీరు కలిగించితిరి గనుక కలిగిరి)

అన. రమాదేవీ! నాయింటికి ముప్వరు బ్రాహ్మణోత్తములతిథులు గావచ్చిరి. ఏదో నియమమున్నదని దిగంబరినై యన్నముఁ బెట్టవలెనని కోరగా నాపతి యానతియ్యయ యదేరీతి వారికి భోజనమిడఁదొడగితిని. నావిభుని మహిమాతిశయమున, మీయనుగ్రహ విశేషమున శిశువులైరి. వారుత్రిమూర్తులా? నేనెఱుఁగనే!

సర. సతీతిలకమా! నీమాటలకు మాకే సిగ్గు బొడముచున్నది. మాయనుగ్రహమున శిశువులైరంటివి. కాదు, మాయాగ్రహ మున ననిపల్కుము. సౌజన్యవన్ననీవె, సుశీలవన్ననీవె. ఆవిప్రులు మాహృదయేశ్వరులే. దీసికంతయు మేమేకారణ భూతలము మాయపరాధముల క్షమించుము,

అన. అమ్మా ! మీరేమి తప్పొనర్చితిరి ? నేనేమి క్షమింపవలె ? నన్నిల యిట్లు వేడుకొనుట ?

సర. తల్లీ !

సీ॥ నీవిన్నపంబులు నిందలుగాఁగొని
యూరకపగఁబూన్కి యొక్కతప్పు ।

లక్ష్మీ. నినుబరీక్షింప నాయినఁపగింజలమేమె
యుడికింపఁబంపుటొండొక్కతప్పు ।

పార్వ. నీకుద్రోహముసేయ మాకాంతులను
జలంబూనిపంపుటయె వేఱొక్కతప్పు ।

సర. నీమహామహిమల నెఱుగక యారీతి
పిన్నాటలాడుట పెద్దతప్పు ॥

లక్ష్మీ. గీ॥ దురభిమానంబుచే నింతజరిగెనమ్మ ।

పార్వ. మాకుఁగలగర్వమంతయు మానెనమ్మ ।

సర. నేరములనెంచకిప్డు మన్నింపవమ్మ ।
వేడుకొందుము పతిభిక్షఁబెట్టుమమ్మ ॥

నార. (స్వ॥ నానాటకమునఁగడపటి యంకవుఁదెఱపడె.)

అం. (స్వ॥ ఆహా ! జరిగిన కథయంతయు వీరివలననేనా ? ఇప్పుడు నిజమెఱుఁగనయ్యె)

అత్రి. దేవేరులారా ! మీరిటు ప్రార్థింపఁజెల్లునా ?

అన. జగన్మాతలారా ! నేనద్దియు నెఱుగ, మీస్తోత్రములకు నేఁ బాత్రనా ?

సీ॥ విజ్ఞాపనములఁబంపితిగాని వానిచే
నలుకబూనితిరని దెలియదమ్మ।
ఇనుపగుగ్గిళ్లమీ రేకోరి నారదు
నంపినారనుచునే నరయనమ్మ।
వచ్చినయతిథులు పాలు లేయని యెంచితిని
మీరావిభులటంచు నెఱుఁగనమ్మ।

గీ॥ మందిరమునకువచ్చిన విందులఁదగు।
చందమునఁద్రుప్తులను నలుపందలంప।
ఇందుమత్పతిచరణారవింద మహిమ।
కందువైరమ్మలార! నేముండెఱుంగ॥

పార్వ. అమ్మా! అనసూయా! నీవు నిష్కల్మషవు. నద్గుణ నంపన్నవు. గరితల మిన్నవు. ఎట్టి మోసము నెఱుఁగవు. నీ ధర్మముల నీవాచరించితివి. నీ నేరమేమియు లేదు. అయినను ‘ముండెఱుంగ’ అని నీవు మందలించిన మాకికముందు గతి యేమి? మాపతుల నీసుతులుగ నేరీతి నొనరించితివో యదే విధమున మరల నీసుతుల మాపతులుగ గావించియిమ్ము.

అం. (స్వ॥ సర్వముచేసిన దీమహాను భావుఁడే. తెల్లము గొట్టిన ఱాయివలె నూరకున్నాఁడు.)

నార. అనసూయాదేవి! నావి యొకటి రెండు నేరముల మన్నించి న్నాప్రార్థనఁగైకొనదగు. నీమహాత్త్వము నెఱుఁగఁగోరియే నే నభిషేక నిమిత్తముఁబాలను దెచ్చియిమ్మంటి. నీసందేశముల వలన నీదేవీత్రయము కోపగించుకొని యాయుక్కు శెనగలఁ బంపఁగా వారిపైఁజెప్పక నేనొక పిద్దయుబద్ధము నీకడఁబల్కి యాశెనగలఁ బక్వముఁచేయించుకొని పోయితిని. ఏంతుల

కనగా నట్లున్నరీతి నీకెఱిగించి యుండినయెడల నాపదార్థ
మును యథారీతి నాకు మరలనిచ్చి యీదేవులను దప్పక
మున్నవేడియే యుందువు. అట్టి నీశాంతత, నీనిరహంకారత
యెఱిఁగియే నాకార్య సాధనమునకై యనృత మాడితిని.
ఇది మదినుంచఁజనదు.

చ॥ కొనకొని నేనుక్షీరములఁగోరి, త్రిశక్తులుగూడియుఁబ్రమా ।
కనగలఁగోరి, విందులమిషఁజనుదెంచి త్రిమూర్తులుకోరరాని రీ।
తినిగుడిపింపఁగోరి, భవదీయసతీత్వవినిర్మలత్వముఁ ।
గనితిమిసంతసంబెసఁగ, గార్యముభంగిఁదలంపుమమ్మరో ॥

అన. మునిపుంగవా! దేవేరులారా! మీరు నన్నింత పొగడమీకు న్యాయమా! నాకుశ్రేయమా! మీచర్యలన్నియు నాయెడ బరమానుగ్రహములనియే తలంచు చున్నాను. నేఁజేసిన తప్పును మన్నింపుఁడు. (అత్రినిఁజూచి) నాథా! ఈజగన్మాతల కపరాధ మొనర్చితినే! వ్యసనముఁగలుగఁజేసితినే! నాకెట్టి పాతకమో తెలియదు. శీఘ్రమున హరిహర బ్రహ్మలను గల్పించి వీరికప్పగింప వేడెదను.

అత్రి. కాంతా! ముజ్జగములనేలువారి నేను బుట్టింపనెంతటివాఁడ? హరిచిత్తము. ఇది యంతయు వారి లీలావినోదముగాక వేఱేమున్నది? వారిచేతులలోని బొమ్మలుగదా మనము! అయిన, ఆ త్రిమూర్తుల కాదిమూర్తి యెవ్వఁడో యట్టి పరమేశ్వరునిఁ బ్రార్థించెదఁగాక.

సీ॥ కార్యకారణములఁగల్పించితత్కార్య
ఫలములఁదిలకించువలతియెవఁడు ?
కర్మలఁదోఁగుచుఁగర్మలనంటక,
కర్మఫలదుఁడైనఘనుఁడెవండు ।
త్రిగుణంబులనుదాల్చి జగముఁగల్గించి
చేకొనిపెంచిముంచు నిర్గుణుఁడెవండు ।
చేతనాచేతన వ్రాతముల్ దానయై
తనయందెయన్నిటింటాల్చునెవఁడు ॥

గీ॥ సత్యమన, దైవమనగ, నైసర్గికమన ।
జ్ఞానమన, శాశ్వతంబన సకలసంజ్ఞ ।
లమరియుండునెవండు, నేనట్టివానిఁ ।
గొలుతునందఱఁబ్రోచుట కొఱకునిపుడు ॥

(త్రిమూర్తులు ప్రత్యక్షమగుదురు) (వాణీ రమా గౌరులు ప్రక్కకుఁబోదురు)

అత్రి. దేవతాసార్వభౌములారా ! నమస్కరించుచున్నాము.
(నమస్కరింతురు)

బ్రహ్మ. అనంతాయురస్తు.

ఈశ్వ. శివంభూయాత్.

విష్ణు. సకలకల్యాణమస్తు. అత్రిమునీంద్ర ! నీతపస్సునకు, నిర్మల మనస్సునకు మెచ్చియున్నాను. నీకు నేను విధేయుఁడను. తల్లీ అనసూయా ! నిర్మలగుణామేయా ! నీ సౌజన్యమునకు మెచ్చితిని. నీకీర్తి యాకల్పముపఱకు వెలయుఁగాక ! తల్లి నీకిచ్చిన వాగ్దానము ననుసరించి మేము ముగ్గురమిపుడు పుత్రుల మైతిమి. ఈపుత్రునిఁబెంచుకొనుము అట్లు నీకు

పుత్రులుగా నియ్యఁబడితిమి గనుక దత్తాత్రేయుఁడని పేరుఁడుము
ఈతఁడు మహాజ్ఞానియై, మహాయోగియై మీయుభయులనే
గాక లోకమంతయునుద్ధరింపఁజేయును.

అన. దేవా! మహాప్రసాదము.

నార. గీ॥ దురభిమానంబు గలిగినదొడ్డవారి ।
నెందఱినోపట్టి మాయానుహిమదలిర్ప ।
వారిగర్వంబడంచినవాఁడవీవు ।
గర్వరహితుల సంపూర్ణకరుణచేత ।
బ్రోచినట్టియు, ప్రోచెడుప్రోడవీవు ।
నిన్నుఁబొరముమ్మట్టనే నెన్న నేర ।
నిగమసంచార! సువిచార! నిర్వికార ।
సజ్జనాధార! సముదార! సత్యసార ॥

విష్ణు. నారదమునీ! నీ వెపుడు వచ్చితివి?

నార. విభూ! దేవీమణులు వచ్చినపుడే వచ్చినాను.

విష్ణు. ఏరీ! ఎక్కడనున్నారు?

నార. ఇదిగో, ఈప్రక్కననే యున్నారు. అమ్మలారా! రండు. ఆజ్ఞయగుచున్నది.

(ముప్పురువచ్చి పతులకు నమస్కరింతురు)

పా. స. } నాథా! మమ్ముక్షమించవలెను, మాది యపరాధమారె.
లక్ష్మీ. } ఈసతీమహిమ నెఱుంగ కుంటిమి.

బ్రహ్మ. శారదా! ఇఁకనిట్టి మూర్ఖము సేయవుగదా! దేనినైనను సరిగా నర్థము జేసికొనుము.

విష్ణు. కమలా! నీవిఁక గర్వపడవుగదా! సత్యమునరయుము.

ఈశ్వ. అపర్ణా! పతివ్రతల గౌరవమే పోవుగదా! శాంతము వహించు
కొనుము.

నార. (ముక్కు చెంపలు వేయించుటయే తక్కువ.)

పార్వ. దేవా! నేరమన్నపిమ్మట మరల మరల నెత్తిపొడుచుట
న్యాయమా!

ఈశ్వ. అయిన, సంతోషమయ్యెడు. మీరుముగ్గురును ఈసతీతిలక
మునకు నాయమ కొడుకునకు నాశీర్వాదము సేయుఁడు.

పార్వ. అనసూయా! నీపుత్రునిటులిమ్ము.

సనం. అమ్మా! వీరు నాతమ్ముల నెత్తుకొని పోరెదరా? నేనివ్వను.

అన. లేదు.

సనం. ముద్దాడెదరా? అటులయిన మువ్వురికిమ్ము.

పార్వ. క॥ మంగళమనసూయాంబకు।

లక్ష్మి. మంగళముసతీమణికి, సుమాణవకులకున్।

సరస్వ. మంగళమత్రితపోధన।
పుంగవునకు సతమునీత్రిమూర్తులకరుణన్।

అత్రి. భగవానులారా! మీచరిత్రములద్భుతములు. మీమాయ
లెవ్వరును గనుఁగొనఁజాలరు. మీపూర్ణ కరుణకుఁబాత్రుల
మైతిమి. మేముధన్యులము. మిమ్ముఁగొనియాడ మాతరమా!

క॥ మంగళముశారదాధవ।
మంగళమురమాధవా! యుమాధవ! భువిలో।
సంగనలాత్మేశుల భ।
క్తిఁగొలిచి, యశంబునొంద దీవింపదగున్!

త్రిమూ. తథాస్తు. తథాస్తు. తథాస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ

